# కథావాహిని

## 4

బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు



ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ

ఆదర్శ ప్రచురణ
తొలికూర్పు 1954
ముద్రణ:
భ్రమరాంబ ప్రెస్,
విజయవాడ.



వెల: రూపాయి

సంపాదకులు:
గద్దె లింగయ్య

# ఇందులో

మన కథానికలు

# మన కథానికలు

కథాసారస్వతం మన సంస్కృతికి కొత్త దేమీకాదు. దేవతల కథలు, పేదరాసిపెద్దమ్మ కథలు, పతివ్రతల కథలు, కాశీమజిలీ కథలు, నీతి కథలు, వీరులకథలు, పురాణకథలు, పిల్లలకథలు మొదలైనవి వరదలూ, వేలూ సంవత్సరాలుగా వస్తున్నవే.

అయితే యిప్పటిరూపంలో—అంటే ఆధునాతన పాశ్చాత్య కథానిక పద్ధతిలో—కథానిక తెలుగులో పుట్టి నలభై ఏభై ఏళ్ళవుతుంది. గురజాడ అప్పారావుగారి "దిద్దుబాటు", "మీ పేరేమిటి?" అన్న కథలతో, కథానికకు యిప్పటిరూపం ఏర్పడినట్టుంది. అందులో రెండోది నాటికీ, నేటికీ సాటిలేనిదిగా వుంది.

కథల విషయంలో ఒకటిమాత్రం ఘంటాపథంగా చెప్పవచ్చు. ఇప్పుడు కథలు చదవనిమనిషి లేడన్నదీ, కథలు లేకుండా వెలువడేపత్రిక లేదన్న యించుమించుగా యదార్థమైన విషయం.

ప్రతినెలా పత్రికలలో వచ్చే కథలు, కొన్నివందల లెక్కలో వుంటు న్నాయి. (పత్రికలు నిరాకరించినవాటినికూడా లెక్కవేస్తే, యీ సంఖ్య వేలలో వుండవచ్చు.) కథల పుస్తకాలు నెలకు పదైనా వస్తున్నా చెప్పడానికి సందేహించనక్కరలేదు. అచ్చయ్యే పుస్తకాలలోనూ, పత్రిక లోనూ కథాసారస్వతమే ఎక్కువ. ప్రత్యేకంగా కథలుమాత్రం వే పత్రికలు చాలా వున్నాయి. కథల పుస్తకాలూ, కథలు అధికంగావ పత్రికలూ తక్కినవాటికంటె ఎక్కువ ప్రతులలో, తక్కువకాలంల అమ్మకం అవుతున్నాయి.

తక్కిన సారస్వతశాఖలతో పోల్చిచూస్తే, కథానిక ఎక్కువ వ్రాస్తూవున్నదీ, చదువుతూవున్నదీ మాత్రమే కాకుండా, ఎక్కువగా వృద్ధిచెందినదికూడాను.

నూతన కథానికకు గురజాడ అప్పారావుగారు సంఘసంస్క భావాలతో పునాదులువేశారు. ఆయనవ్రాసిన కథలు చాలా కొద్ది మాత్రం అయినప్పటికీ, చాలా పరిపక్వతచెందినవి. ఆ అభ్యుదయ సాం దాయాన్ని ఈసాహిత్యశాఖ చాలావరకూ అంటిపెట్టుకువుందని చెప్పవచ

కాని అప్పుడప్పుడు, మన కథానికా పరిణామంలో దాన్ని కామజ్వర తీవ్రత పట్టుకొని పీడించడంకూడా జరిగింది. శ్రీ సమస్యను పరిష్కరించ బోయి గుడిపాటి వెంకటచలంగారూ, యవ్వనచాపల్యంచేత యింకొందరూ యీ పద్ధతిని అవలంబించారు. ఇది కొంతకాలం జోరుగానే ప్రబలినా, అంతర్గతంగా వున్న అవాస్తవికతమూలంగా ఎక్కువగా నిలవదొక్కుకోలేక పోయింది.

మన కథానికా పరిణామంలో కనిపించే యింకో పెడదోవ, భూస్వామ్య నాగరికతవేపుకు మనసును మళ్లించే ప్రయత్నం. ఇది అదృష్టవశాత్తూ ఒక రిద్దరు రచయితలకు మాత్రం పరిమితమై వుండిపోయింది. తరువాత రానురాను అంతరించింది.

ప్రస్తుతం మన కథలలో ఎక్కువగా కనిపించేవస్తువు మధ్యతరగతి అభిరుచికి సంబంధించిన విషయాలు. కథకులు నూటికి తొంభైమంది యీ తరగతికి చెందినవారు కావడంవల్ల, వారి అనుభవం యిందుకు పరిమితమై వుండడంవల్లా యిది సహజమే.

పది పదిహేనేళ్ళక్రితంవరకూ మధ్యతరగతి ప్రజలు సాంఘికంగా అనుభవించే కష్టసుఖాలూ, వారి సమస్యలు, అభిరుచులు, బాగోగులు కథా వస్తువులుగా వుంటూ వుండేవి. కాని యుద్ధం, కరువు, నిరుద్యోగం మొదలైన వాటి మూలంగా మధ్యతరగతివారి కష్టాలూ, బాధలూ ఎక్కువవుతూన్న కొద్దీ కథకులలో—ప్రజలందరిలోలాగానే—ఆర్థికసమస్యలపట్ల చైతన్యం హెచ్చి, కథలకు ఆర్థికస్వభావం వచ్చింది. దీనికి సామ్యవాద భావాల వ్యాప్తి తోడయి, రాజకీయస్వభావంకూడా వస్తూవుంది. పీడిత మధ్యతరగతి పట్ల, కార్మిక కర్షకులపట్ల సానుభూతిని ప్రకటించేధోరణి ఎక్కువవుతూంది.

అయితే కథానిక మనభాషలో పరిపక్వతి పరిపూర్ణత చెందిందని చెప్పడం సాధ్యంకాదు. కథానికలో ఎన్నో లోపాలు కనిపిస్తున్నాయి. ఈ లోపాలను, వాటికి కారణాలనూ బాగా ఆలోచించడం అవసరం.

అవసరమైన సామగ్రినంతటినీ సేకరించుకోకుండా కథారచనకు పూనుకోవడం, యిందుకు ఓపికగా కృషి చేయకపోవడంవల్ల వచ్చే లోపాలు కొల్లలు.

కథ నాలుగు పేజీలదే కావొచ్చు. దానిలో వచ్చే నానారకాల పాత్రలు, పరిస్థితులు, సంఘటనలు, సంఘర్షణలు, స్థలాలు, వీటిమధ్య సంబంధాలు...వీటిని క్షుణ్ణంగా తెలుసుకునిగాని రాత మొదలుపెట్టడం క్షేమం కాదు. కథ ఒక జీవితఖండం. దాని వెనకాతల బోలెడు చరిత్ర వుంటుంది. కథావస్తువుకు సహాయకారిగావున్నంతవరకూ దీనినికథలో సూచనప్రాయంగా స్ఫురింపజేయాలి. కథకునికి కథావస్తువు సంపూర్ణంగా సాక్షాత్కారించినప్పుడే, మంచికథకు పునాదిపడుతుంది. కాని యీ పునాదిదిట్టంలేని కథలు తరచుగా కనిపిస్తూవున్నాయి.

తెలియని విషయాన్ని, ఎరగని మనుషుల్ని, చూడనిప్రాంతాన్ని కథలో పెట్టి నవ్వులపాలయిన సందర్భాలు చాలా తటస్థించాయి. కథగా కంటె వ్యాసంగా కనిపించేవీ, చెప్పబోయే విషయం కథలో సరిగా పొదగడం కుదరక ఉపన్యాసాలుగా మారేవీ, కథకు సంబంధించిన వాతావరణాన్ని సరిగా సృష్టిచెయ్యలేకపోయినవీ, పాత్రలచేత అస్వాభావికమైన ప్రవర్తన చేయించేవీ, మాటలాడించేవీ...కనిపించడం అరుదేమీకాదు. తన వస్తువును, అందుకు సంబంధించిన విషయాలన్నిట్నీ అరిచేతిలో అద్దంలాగ పెట్టుకోకుండా రచనకు ఉపక్రమించడం, కథకుని అభివృద్ధికి మార్గంకాదు.

ఆర్థికస్థితి, సంస్కారం, విద్య, ప్రాంతం, కులం మొదలైనవన్నీ కొద్దిగానో గొప్పగానో మన ప్రవర్తనమీద, మాటలమీద ప్రభావం చూపుతూ వుంటాయి. మన కథకులు దీనిని బాగా గమనిస్తున్నట్టులేదు. ఇందువల్ల జరిగే అసందర్భాలు పాఠకుడికి కథకునిమీద గౌరవం చెడగొట్టడమూ, పాఠకుడికి కథలంటే మొహంమొత్తించడమూ చేస్తున్నాయి.

పాత్రపోషణ విషయంలో "కన్యాశుల్కం" ఆదర్శంగా పెట్టుకోవలసిన గ్రంథం. పరమ ఛాందసుడు అగ్నిహోత్రావధానులు, కడజాతివాడు అసిరిగాడు, లౌక్యుడు రామప్పంతులు, తుంటరి గిరీశం, అమాయకురాలు బుచ్చెమ్మ, పెద్దమనిషి సౌజన్యరావు మొదలైనవారి ప్రవర్తన, ఆలోచన, మాటలు మన కథకులు శ్రద్ధగా గమనిస్తే చాలా లాభం పొందుతారు.

పాత్రోచిత సంభాషణల విషయంలోకూడా 'కన్యాశుల్కం' మన కథకులు నమూనాగా పెట్టుకోవలసిన రచన. విశాఖజిల్లా పాత్రలచేత 'వచ్చి[illegible]' 'పోయిన్నై', 'నీకుమల్లె', 'నాకుమల్లె' అనిపించడమూ, సామాన్య పాత్రలచే[illegible] భావకవిత్వం మాటాడించడమూ కథకు పుష్టినివ్వవు.

కథ వ్రాస్తున్నప్పుడు తనమీద ముసిరే భావాలన్నిటినీ కథలోకి ఎక్కించి, కథకులు తమకథలను అధికప్రసంగాలుగా చేసిన సందర్భాలున్నాయి. అనవసరమైన విషయాలను వదిలిపెట్టడం అంటే, తన శరీరంనుండి ఒక కండను కోసుకున్నట్లుగా బాధపడేమనిషి మంచికథలు వ్రాయలేడు.

మంచికథలు వ్రాసి, ఉత్తమ కథకులుగా పేరుపొందినవారు కూడా పేలవంగానూ, చప్పగానూకూడా వ్రాసినవి వున్నాయి. దీనికి వారి శ్రద్ధలోపమేగాని ప్రతిభలోపం కారణంకాదు. సరియైన ప్రిపరేషన్ లేకుండా పత్రికాధిపతులు, గ్రంథ ప్రకాశకులు యిచ్చే స్వల్పప్రతిఫలం కూడా అత్యావసరమయ్యే ఆర్థికదుస్థితిలో వుంటూ హడావుడిలోచేసే రచనలివి. చాలా సందర్భాలలో కథల పాకం చెడడానికి సంపాదనదృష్టి కారణమవుతోంది.

ఏ రచనకైనా చాలా పరిశ్రమ కావాలి. కథకు కూడా పరిశ్రమ అవసరం. మనకథల నాణ్యం లోపించడానికి కథకుల పరిశ్రమలోపం ఎక్కువగా కనిపిస్తోంది. విశ్వసాహిత్యంలో గొప్పకథలుగా పేరుపడ్డవాటిని మన కథకులు జాగ్రత్తగా చదివి, అవి ఎందుకు గొప్పవయ్యాయో అర్థంచేసుకోవడం చాలా మేలుచేస్తుంది. చెఖోవ్ వంటి గొప్ప కథకుని కథా సారస్వతాన్ని పరిశీలనగా అధ్యయనం చేయడం, మన కథకుల పురోభివృద్ధికి ఎంతయినా అవసరం.

ఇప్పుడు వస్తోన్న కథా సారస్వతంలో మనదేశపు తక్కిన భాషలలోనుంచీ, యితరదేశాల భాషలలోనుంచీ తెనిగింపబడుతున్న కథలు ఒక పెద్ద భాగంగా వున్నాయి. అయితే యీ దిగుమతి అట్టే విచక్షణతో జరుగుతున్నట్టుగా కనిపించదు. ఒకటోతరగతివాటికంటె రెండు, మూడు తరగతుల కథలు, వీటిలో చాలా హెచ్చుగా వుంటున్నాయి. ఎంపికలేకుండా జరుగుతూన్న యీపని మన భాషకూ, వాటి మాతృకల భాషలకూ న్యాయం చెయ్యడంమాత్రం కాదు. ఎంచుకునేటప్పుడు ఉన్నత ప్రమాణాలనుబట్టి ఎంచుకోవడం చాలా అవసరం. ఇతర భాషలనుండి చేసుకునే అనువాదాలు, మన కథకులకూ, పాఠకులకూ సరియైన అభిరుచులను కలిగించేట్టుగా వుండాలి.

ఇప్పుడిప్పుడు తెలుగులోనుంచి ఇతర భాషలలోనికి కథలు మొదలైనవి అనువదింపబడుతూవుండడం జరుగుతూంది. కాని మన ఉత్తమోత్తమ రచనలు కాక, సామాన్యమైనవీ, అంతకు తక్కువవీ యితర భాషలలోకి

వెళ్లడం మనకు ప్రతిష్టాకరంకాదు. మన కథాసారస్వతం, తక్కిన మనదేశపు భాషలలో వున్నదానికంటె తీసికట్టుగాలేదని విజ్ఞుల అభిప్రాయం. కాని మనకు దిగుమతిపై వున్న అభిమానం, ఎగుమతిమీద లేదు. ఇప్పటివరకూ కూడా ఆంధ్ర సారస్వతం, అఖిలభారతదృష్టిలో నామమాత్రంగానే వుంది. ఉత్తమ రచనలద్వారా యితర ప్రజల జీవితాన్ని తెలుసుకోవడం ఎంతఅవసరమో, మన జీవితాన్ని యితర ప్రజలకు తెలియజేయడంకూడా అంత అవసరం. కాని ప్రస్తుతం యిది రెండువేపులా జరగడంలేదు. ఇందుకు యితరులను నిందించేదానికిముందు, మనం ఆత్మవిమర్శ చేసుకోవడం మంచిది.

ఆత్మాభిమానం అవసరమైనదానికంటె ఎక్కువగానే వున్నా, ఆంధ్రులు యితరులదగ్గర లోకువతనంతోనూ, జంకుతోనూ, బెరుకుతోనూ బాధపడుతున్నారు. ఇందువల్ల కడపంక్తిలో కూచోవడంమాత్రమే వారికి యిష్టం. ఎవరైనా దయదలిచి ముందుకుతోసినా, తప్పించుకొనివచ్చి కడపంక్తికే వచ్చేస్తారు. ఆత్మవిశ్వాసానికీ అహంకారానికీ ఎడం తలవెంట్రుకవాసిగా మాత్రమే వుంటుందన్న విషయంపట్ల జాగ్రత్త వహించి, ఆంధ్రులు యీ బుద్ధి మార్చుకుని ఆత్మవిశ్వాసం ఏర్పరుచుకోవాలి. ఇతరులనుండి పుచ్చుకున్నప్పుడు వారి ప్రత్యేకతనూ, విశిష్టతనూ చూపేవాటినిమాత్రం తీసుకునేట్టుగానే, యితరులకు యిచ్చేటప్పుడుకూడా అటువంటివాటినే యిచ్చి, మన సంఘాన్ని, సంస్కృతినీ యితరులకు తెలియజేసి, మన జాతికి పేరు ప్రతిష్టలు సంపాదించాలి.

మన కథా సారస్వతం అన్నిప్రాంతాల ఆంధ్రుల జీవితాన్ని ప్రతిబింబిస్తోందని చెప్పలేము. మధ్య జిల్లాలవారు ఎక్కువగా కథలు వ్రాస్తూండడంవల్ల, ఆ మండలం జీవితం మన కథాసారస్వతంలో బాగా కనిపిస్తోంది. ఇటీవల తెలంగాణానుండి ఇది కొస్తోకూస్తో వస్తోంది గాని, రాయలసీమనుండి వచ్చేది బహుస్వల్పం. ఈ మండలాల రచయితలు యీ కొరతను తీర్చి మన కథా సారస్వతానికి విశాలాంధ్ర స్వరూపాన్ని ఏర్పరచాలి.

కథా సారస్వతాన్ని ప్రచురించేవారు చాలామంది వున్నారు. కాని కథకునికి ప్రతిఫలం యిచ్చేందుకు సిద్ధంగావున్నవారు చాలతక్కువ. ఆ ఇచ్చేదయినా చాలీచాలని నాలుగురాళ్లు. కథారచన రచయితను పోషించేస్థితికి రాలేదు. మన కథల ప్రమాణం ఉచ్చస్థాయిని అందుకోడానికి, యిది పెద్ద ఆటంకంగా వుంది.

కథకుడు కథా రచనను వృత్తిగా సాగించలేకపోతున్నాడు. పత్రికల లోనో, గుమాస్తాగానో చాకిరీచేస్తూ దానిని జీవితాధారంగా చేసుకుని, కథా రచనలో తనకృషిని కేంద్రీకరించలేక పోతున్నాడు. ఇందువల్ల ఎక్కువ పరిశ్రమించడం, ఎక్కువగా కాలాన్ని వినియోగించడం సాధ్యంకావడంలేదు. ఇది కథకులనేకాకుండా మన కవులను, యితర రచయితలనూ కూడా బాధిస్తున్న సమస్య; ఆర్థిక, రాజకీయ పరిస్థితితో ముడిపడివున్న సమస్య.

కథారచన కేవలం హాబీగా కాకుండా, ఒక వృత్తిగా ఏర్పడనంత కాలం, అది అభివృద్ధిచెందడం అసాధ్యంగా కనిపిస్తుంది. రచయితలకు, కళాకారులకు ఆర్థికమైన ప్రోద్బలాలను సృష్టించలేనంతకాలం కళలు, సంస్కృతి ఎక్కువగా వృద్ధిచెందడంలేదంటే ఆశ్చర్యపడనక్కరలేదు.

మన ప్రజలకు చదువుసంధ్యలు తక్కువగా వుండడం, అందుచేత పత్రికలు పుస్తకాలు చదివేవారి సంఖ్య కొద్దిమందికిమాత్రం పరిమితమై వుండడం, కొనుగోలుశక్తి తగినంతగా లేకుండావుండడం, పైని చెప్పినట్లు రచన రచయితను పోషణకల్పించేస్థితిలో లేకపోవడం, ప్రచురణ విక్రయాలు సక్రమపద్ధతిలో నిర్మాణంగా వ్యాప్తి లేకుండా వుండడమూ, వేలకొద్దీ పుస్తకాలూ పత్రికలూ అమ్ముకోవడానికి అవకాశంగల లక్షల జనాభావున్న నగరాలు లేకపోవడమూ—యివీ. యిటువంటివీ అడ్డంకులుగా వున్నాయి.

ఇవి రచయితలే కాకుండా పాఠకులూ, ప్రజలూకూడా తీవ్రంగా ఆలోచించవలసిన సమస్యలు.

ఇందులోని కథలను, కథకుణ్ని పరిచయంచేయడానికి పూనుకోవడం పాఠకుల విషయజ్ఞానాన్ని శంకించడం అవుతుంది. కథలు—సజీవమైన భాషలో, నిత్యజీవితవిషయాలను, అభ్యుదయదృష్టితో వ్రాసినవి; ఇంతకు ముందర పత్రికలలో వెలువడి పాఠకుల ప్రశంసలను అందుకున్నవి. కథకుడు—పాఠకలోకానికి సుపరిచితుడు కావడంమాత్రమే కాకుండా, యిటీవల జరిగిన ప్రపంచ కథలపోటీలో మనదేశంలో ద్వితీయ బహుమానాన్ని పొంది, ప్రపంచపోటీలో ప్రవేశించి ఆంధ్రులకు గర్వకారణమైన కథను వ్రాసిన రచయిత. దయచేసి చదవండి.

న్యూ ఢిల్లీ
అక్టోబరు 17, 1954.

సెట్టి ఈశ్వరరావు.

140 125

# నాగరికులు

ఉదయం ఆరు గంటలకు రావలసిన బండి రెండు గంటలు లేటు. పార్వతి కేమీ తోచక బెంచీమీద చతికిల బడింది. ఈ బండికోసమని ప్రొద్దున్నే 5 గంటలకల్లా లేచి తొందర తొందరగా రావలసివచ్చింది. తీరా వస్తే బండి లేటు. స్టేషనులో ప్రయాణీకులు పెట్టెలమీద, బెడ్డింగులమీద కూర్చుని బండికోసం నిరీక్షిస్తున్నారు. బండి ఆలస్యంగా వస్తూందంటే ఎవరికీ చిరాకెయ్యదు. తమకాలం వృథాగా వ్యయమౌతూందని ఎవరూ విచారించరు. బళ్ళు లేటుగా రావడమనేది నిర్వహణంలోని అసమర్థతను సూచిస్తుందని ఎవరికీ తట్టదు. బళ్ళు ఆలస్యంగా రావడం, వాటికోసం పడిగాపులు పడడం అందరికీ అలవాటైపోయింది మరి! రోజూ చచ్చేవాడికోసం ఎంతకని ఏడుస్తారు? అందుకే పల్లెటూరి ప్రయాణీకులు బుకింగ్ ఆఫీసుదగ్గరకొచ్చి "బాబూ, తొమ్మిది గంటల బండి ఎన్ని గంటలకొస్తాది బాబూ" అని అమాయకంగా అడుగుతారు. పార్వతి తనలో తనే నవ్వుకుంది.

కొళాయిచుట్టూ జనం మూగేరు. ఆడవాళ్ళూ, మొగవాళ్ళూ మొహాలు కడుగుతున్నారు. స్టేషనుదగ్గర నున్న వేపచెట్టు పుల్లలు విరిచి పళ్ళు తోముతున్నారు. ఒక వస్తాదు అక్కడే స్నానం చేస్తున్నాడు. సమంగా చెంబు తోముకోనిచ్చారు కారని, ఒక మార్వాడీ అక్కడివాళ్లతో పోట్లాడుతున్నాడు. ఒకరి భాష వొకరికి రాదు. ఎవరిభాషలో వాళ్లు గట్టిగా కేకలేస్తున్నారు. అనువదించడానికి దుబాషీవుంటేగా!

బెల్లంముక్కమీద ఈగలు ముసిరినట్టు కాఫీదుకాణం చుట్టూ మనుషులు మూగేరు. కాఫీ, ఇడ్లీ వగైరా సేవిస్తున్నారు. కమ్మటి పెసరట్టు వాసన పొయ్యిదగ్గర బయలుదేరి తెరలు తెరలుగావచ్చి స్టేషనంతా వ్యాపించింది. బండి లేటుగా వచ్చిందంటే దుకాణదారుడు పదిరూపాయల బేరం అదనం చేసుకున్నాడన్నమాటే.

బాగా తెల్లవారింది. సూర్యోదయముకూడా అయింది. ఎదురుగుండా రైలుపట్టాలమీద సూర్యకిరణాలుపడి తళతళ మెరుస్తున్నాయి. గూడ్సుబళ్ళు అటూ ఇటూ తిరుగుతున్నాయి. రైల్వే కార్మికులు పుడకలతో పళ్లుతోముకుంటూ, చేత్తో జండాలు చూపిస్తూ, రైలుపట్టాలు మారుస్తూ తమ పనులు చేసుకుపోతున్నారు. కొందరు రైలుపట్టాలమీదే కూర్చుంటారు! బండి తమదగ్గరకొచ్చేవరకు లేవరు! అసలు రైల్వేయార్డులోకూడా అతి నిర్భయంగా ఇంట్లో తిరిగినట్టే తిరుగుతారు! అవును మరి! జాలరివాళ్లు సముద్రాన్ని కోనేటి కన్నా అన్యాయంగా చూస్తారు! పాములవాడు పాములంటే భయపడతాడా ?

పార్వతి కేమీ తోచక పుస్తకాలదుకాణంవైపుకి బయలుదేరింది. రైల్లో చదువుకునేందుకు పత్రిక లేవైనా కొనాలని అనుకుంది. అబ్బ! ఎన్ని పత్రికలు! కాని వాటిలో మంచి పత్రికలు నూటికి రెండు మూడుకంటె ఎక్కువ లేవు, చాలవరకు సినిమా పత్రికలే!

"ఏమిటండీ వెదుకుతున్నారు ?" అన్నాడు ఆ పక్కనున్న పెద్దమనిషి.

ఆమె తల ఎత్తి పెద్దమనిషివేపు చూచింది. పెద్దమనిషి ముప్ఫయ్యేళ్ల యువకుడు. సింహాలు, పులులు, దుప్పులు తదితర జంతుకోటి బొమ్మలున్న అమెరికన్ బుష్‌షర్టు వేసుకున్నాడు. తలకి ఈవినింగ్ హేట్, నోట్లో పైపు, చేతిలో నాలుగైదు అమెరికన్ పత్రికలు-లైఫ్, ట్రూస్టోరీ, పోస్ట్, ట్రూరోమాన్స్ వగైరా వగైరా.

"నువ్వు నన్ను గుర్తుపట్టినట్టులేదు" అన్నాడాయన ఇంగ్లీషులో.

పార్వతి ఒక నిమిషం గాభరాపడింది. "నేను కె. ఎస్. చారిని" అన్నాడు ఆచారి.

పార్వతి తలదించుకుంది. ఆమె మొహం ఎర్రబడింది. ఆమె గుండెలు దడదడ కొట్టుకున్నాయి. ఆచారి ఆమె మాట్లాడడానికి అవకాశం ఇవ్వలేదు. "ఈయన నీకు తెలుసా" అని ప్రక్కనే తదేక దీక్షగా పుస్తకాలు చూస్తున్న రామాన్ని జబ్బపట్టుకు లాగాడు. రామం తృళ్ళిపడిచూసేడు.

"ఓహో పార్వతి, ఇలా వచ్చావేం, మామయ్యగారింటినుంచా ?" అన్నాడు రామం.

"అవును. సెలవలకు విజయవాడ వెళ్ళాలనుకుంటున్నాను" అంది పార్వతి.

"ఆచారికూడా నా కిక్కడే ఒక అరగంటక్రితం కలిశాడు. నాలుగేళ్ళలోను ఎంత మారిపోయాడో చూశావా పార్వతీ, మొదట పోల్చుకోలేకపోయాను" అన్నాడు రామం.

"ఎన్నాళ్ళయింది అమెరికానుంచి వచ్చి ?" అన్నది పార్వతి తలదించుకొని.

"సుమారు ఏడాది కావచ్చింది" అన్నాడు ఆచారి నిబ్బరంగా.

"అమెరికాలో యింత చదువు చదివి వొస్తే ఏడాద యినా యింకా ఉద్యోగం దొరకలేదోయ్! చిత్రంగా ఉందే!" అన్నాడు రామం నవ్వుతూ.

"పెద్ద ఉద్యోగం కావాలంటే కొంతకాలం పడుతుంది మరి" అన్నాడు ఆచారి సీరియస్‌గా.

అక్కడికి చిన్న ఉద్యోగాలు తేలిగ్గా దొరుకుతున్నట్టు. ఒకమూల ఉద్యోగంలేక అవస్థపడుతున్నా, ఈ వ్యవస్థ తన కన్యాయం చేస్తున్నా, అన్యాయాన్ని సమర్థించడం నాగరికత కాబోలు! పోనీ ఆచారి చాల డబ్బున్నవాడేం కాదు. వాళ్ళ నాన్న ఒక హైస్కూలుకి హెడ్‌మాస్టర్‌గా పనిచేశాడు. హెడ్‌మాస్టరంటే ఏమిటుంటుంది. పేరు గొప్పా ఊరు దిబ్బా గాని, పిల్లల పెళ్ళిళ్ళూ, చదువులూ అయ్యేసరికి ఆర్జించింది కాస్తా పచ్చకర్పూరంలా హరించిపోయింది. ఆచారి బి. ఎస్. సి. అవద్సు ప్యాసయి, ఈలోగా స్కాలర్‌షిప్ సంపాదించి అమెరికా వెళ్ళాడు. చదువులోమాత్రం ఆచారి గట్టివాడు, ఏమాట కామాటే చెప్పుకోవాలి!

రామానికి ఆచారి చిన్ననాటినుండీ తెలుసు. ఇద్దరూ కలసి ఇంటరువరకూ చదువుకున్నారు. ఆచారికుటుంబంలో అంతా సనాతనులు. అతనితండ్రి పరమచాదస్తుడు. ఇంటర్ మీడియట్‌వరకూ ఆచారికి తలమీద ముడి వుండేది. కాలే జీలో అంతా వేళాకోళంచేసేవారు. ఇప్పుడు ఆచారి చాల మారిపోయాడు.

పార్వతి తండ్రి, ఆచారితండ్రీ చిన్ననాటి స్నేహితులు, ఒక శాఖవాళ్లూను. పార్వతితండ్రి ప్లీడర్ చేసి కొంచెం గడించేడు. అయితే ఆయన చాల మంచివాడు. విద్యావంతుడు. నిగర్వి. పాపం మగసంతానం లేదు. అందుచేత ఆయనకు పార్వతి అంటే పంచప్రాణాలున్నూ, ఆమెకు మంచిసంబంధం చూసి పెళ్ళిచెయ్యాలని ఆయన కోరిక. అయితే ఆఖరికి మంచి సంబంధమే నిశ్చయించాడు. సాంప్రదాయకమైన కుటుంబం. కుర్రవాడు తనకళ్లముందే పెరిగి పెద్దవాడయ్యాడు. ఉన్నతవిద్య అభ్యసించేడు. ఆచారి తండ్రికూడా అందుకు వొప్పుకున్నాడు. నిజంగా పార్వతి అదృష్టవంతురాలే.

"నీకు పార్వతి యింతకు మునుపు తెలుసునన్నమాట." అన్నాడు ఆచారి రామంతో.

"బాగా అన్నావ్! వారి కుటుంబమంతా మాకు మిత్రులే. మా నాన్నగారు విజయవాడలో పనిచేసినప్పుడు వారింటి ప్రక్కనే వుండేవాళ్లము. పార్వతి నాన్నగారిదగ్గిర మా కెంతో చనువు వుండేది. ఆయన పండితులు. చేసేది ప్లీడరీ అయినా మంచి రసికులు. సంస్కృత కావ్యాల్లోని రసవంతమైన శ్లోకాలు చదివి మాకు అర్థం చెప్పేవారు. ఆ రోజులు చాల హాయిగా వుండేవి"

"పోనిస్తూ, ఆయన వొట్టి చాదస్తుడు. ఆయన్ని నువ్వే పొగడాలి" అని ఆచారి పెదవి విరిచేడు.

"అవున్లేవోయ్, అంతా మీలాగేదొర లెలాగవగలరు?"

ఆయన నీకు కాబోయే మామగారని చెప్పకోవడం నీకు చిన్నతనంగా ఉన్నట్టుంది. పాపం! అని రామం పార్వతి

వేపు చూసి నవ్వేడు.

పార్వతి సిగ్గుపడలేదు. కాని అభిమానంతో కృంగిపోయింది. తండ్రి నెవరేమన్నా ఆమెమనస్సు చాలా బాధ పడుతుంది.

నిజమే. ఆయన పూర్వాచారపరాయణుడు. అయితే మట్టుకు ఆయన విద్యావంతుడు. నిరాడంబర జీవి. దాన ధర్మాలు చేసిన కర్మిష్ఠి. ఆయన అనేకమందికి చదువులు చెప్పించేడు. పెళ్ళిళ్ళు చేయించాడు. దయార్ద్ర హృదయుడు. పార్వతికి తండ్రితో అనేక అభిప్రాయభేదాలున్నాయి. కాని ఆయనంటే ఎంతో గౌరవభావం. అటువంటి తన తండ్రిని గురించి ఆచారి తేలిగ్గా మాట్లాడితే పార్వతికి కష్టంగానే వుంటుంది.

రామం నిశ్శబ్దాన్ని భంగంచేశాడు. "కాని ఆచారి నిజంగా ఎంతమారిపోయాడు! అప్పుడుగానీ, ఒకమాట చెప్ప వోయ్! ఆచారీ, యీ బుష్కోటుమీద యీ అడివి మృగా లేమిటోయ్! రాజమండ్రీ ఇది వేసుకునే వెళ్తావేమిటి? కొంపదీసి కుక్కలు వెంటపడగలవు. అదేం వాషింగ్‌టన్ కాదు తెలుసా?" అన్నాడు రామం నవ్వుతూ. పార్వతి పకపక నవ్వింది. ఆచారి కిదేం నచ్చలేదు. ఈ ధోరణిని ఎలాగైనా తప్పించాలనుకున్నాడు. రామాన్ని తీసుకుని టిక్కెట్లు కొనడానికి బయలుదేరేడు. ట్రెయినొచ్చే వేళకూడా అయింది.

ప్లాటుఫారంమీదికి బండి రానేవచ్చింది. పార్వతి ఆచారి, రామం ఇంటరుక్లాసు పెట్టెలో కెక్కి కూర్చున్నారు. పెట్టెలో అయిదారుగురు ప్రయాణీకుల కంటె ఎక్కువ లేరు.

ఆచారి హడావుడిగా సామాన్లుసర్ది, బెంచీమీద కూర్చుని నిట్టూర్పులతో, చెమటతుడుచుకున్నాడు. రామం వాళ్ళ కెదురుగా బల్లమీద కూర్చుని పార్వతివేపు పరిశీలనగా చూసేడు.

పార్వతి తలవంచుకుని జడలో సంపెంగలు ముడుచుకుంటూంది. నల్లగా తాచుపాములాంటి ఆ జడ అతిబరువుగా జారుతూంది. పార్వతికి విద్యావంతుడైన భర్త లభించనున్నాడు. ఆచారి పెద్దఉద్యోగం చేస్తాడు. కావలసినంత ఐశ్వర్యం. ఏ నగరంలోనో పెద్దబంగళా, పువ్వులతోట, కారు, నౌకర్లు. జీవితం హాయిగా, దర్జాగా గడుస్తుంది. నిజంగా పార్వతి అదృష్టవంతురాలు, అనుకున్నాడు రామం.

పార్వతి తలెత్తిచూసింది. రామం మొహం ప్రక్కకి తిప్పి స్టేషన్‌లోకి చూసేడు. కిటికీలోంచి గాలి తెరలుతెరలుగా వచ్చి, సంపెంగలవాసన పెట్టంతా వ్యాపించింది.

"నువ్వు ఎంతవరకు కొన్నావు టిక్కెట్టు" అని అడిగేడు ఆచారి.

"అనకాపల్లి వరకు. అక్కడ నా స్నేహితురాలి యింటికి వెళ్లాలి. రేపక్కడనుంచి విజయవాడ వెళ్తాను."

"నాతో యిప్పుడు రాజమండ్రి రారాదా. నాకా ఊళ్లో ఏం తోచదు. రెండు రోజులుండి వెళ్ళిపోవచ్చును. మా వాళ్లంతాకూడా ఎంతో సంతోషిస్తారు" అంటూ ఆచారి పార్వతిని బతిమాలేడు. పార్వతి అలాగేనంది.

"రామంకూడా వస్తే బాగుండును".

"అవునోయ్, మాతో రారాదా. నాలుగు రోజులుండి వద్దువుగాని" అన్నాడు ఆచారి.

"అమ్మయ్యో, ఇవాళ మా స్కూలు తెరుస్తారు. వెళ్ళాలి."

"ఏమిటోయ్, ఇంతోటి అయ్యవారి వుద్యోగానికే భయ పడుతున్నావ్! పోతే పోనీ."

"ఈ అయ్యవారి ఉద్యోగం కూడా వూడిపోతే నేను అడుక్కుతినాలి" అన్నాడు రామం నవ్వుతూ.

"ఏమిస్తారు?"

"ఏదో నూరు రూపాయిలిస్తారు"

"బాగానేవుందే చాలదేమిటి, మీరుచెప్పే చదువుకి"

పక్క బెంచీమీద కూర్చున్న ఇద్దరు యువతీ యువకులు యీ మాట విని పకపక నవ్వేరు. అచారికూడా వాళ్ళవేపు నవ్వేడు.

"అవునండీ, మనదేశంలో టీచర్లు పిల్లలకేం చెప్పరు. తమదగ్గర ప్రైవేటు చెప్పించుకునే పిల్లల్ని ప్యాసుచేస్తారు. కాని ఆ కుర్రకుంకల్తో మహా యమయాతన లెండి. మేస్టర్లకి పేర్లు పెట్టేస్తారు; ఏడిపిస్తారు. అసలు వీళ్ళ కిచ్చేజీతాలు ఆ కష్టానికే ఇస్తారు... అసలు స్కూల్సు అంటే అమెరికాలోనే సుమండీ, నేను అమెరికాలో వున్నప్పుడు..."

"ఓ. మీరు అమెరికా వెళ్ళివచ్చారా?" అంది యువతి.

"ఆ రెండేళ్ళున్నానులెండి. కాలిఫోర్నియా యూని వర్సిటీలో రిసెర్చి చేసేను."

"సారీ, ఏదో చెబుతూంటే అడ్డొచ్చాను."

"అక్కడ నా కొక లేడీ టీచరు ఫ్రెండ్ ఉండేది, ఆవిడతో కలిసి ఒకసారి వాళ్ళస్కూలుకు వెళ్ళాను. ఓహో,

ఏం క్రమశిక్షణ! ఏం శ్రద్ధ! ఏం టీచింగ్! అంతేకాదండీ, బాంబులు, విమానదాడులు వచ్చినప్పుడు ఎలా ప్రవర్తించాలో అన్నీ చక్కగా నేర్పుతారు.

ఎడ్యుకేషన్ అంటే ఏమిటీ? లోకజ్ఞానమేకదండీ. అలాంటి ట్రెయినింగు వుండబట్టే అమెరికావాళ్ళు అంత గొప్ప వాళ్ళయారు, ఏమంటారు?"

"నిజమేనండీ- ఏదైనా కుర్రవాళ్ళను తయారుచెయ్యడంలో వుంటుంది" అన్నాడు యువకుడు.

"అమెరికాలో లైఫ్ బాగుంటుంది కదండి!" అన్నది యువతి.

"అమెరికన్లకు లైఫ్ అంటే ఎడ్వెంచరేనండీ!" అంటూ ఆచారి అమెరికన్ ప్రెసిడెంటులా పోజ్ పెట్టాడు. లేచి వాళ్ల బెంచీదగ్గరకెళ్ళి స్టేట్స్‌ఎక్స్‌ప్రెస్ సిగరెట్ యువకుడికి అందించి అక్కడ కూర్చొబడ్డాడు. అమెరికా గురించి ఎవరేనా తన్ను అడిగితే ఆచారి వొళ్లుమరచిపోతాడు. అందులోకీ ఆయువతి నోరు విడిచి అడిగిందాయెను! అదీ మామూలు అమ్మాయా! ఆధునిక నవనాగరిక యువతి. పెదవులకి ఎర్ర రంగు వేసుకున్నయువతి. అమెరికా అంతటి భూతలస్వర్గం గురించి తెలుసుకోవాలని ఎవరికుండదు, ఎవరో పార్వతి లాంటివాళ్ళకి తప్ప. పార్వతి నిర్లక్ష్యం ఆచారికి నచ్చలేదు.

అమెరికాలో హోటల్సు గురించీ, సినిమాలగురించీ, హాలీవుడ్ నటీమణులగురించీ, ఆడవాళ్ళగురించీ, ఆచారాలగురించీ, ఆచారి చాలసేపు వాళ్లకి ఉపన్యాసమిచ్చేడు. ఆ యువతి ఇదంతా వింటూ తన్మయీభావంలో మైమరచి తనభర్త

భుజాలమీదవాలి తను ప్రస్తుతం అమెరికా భూతలస్వర్గంలోనే వున్నట్లు భావించుకుంది.

"అదేమిటి ఆచారి వాళ్ల దగ్గరకెళ్లి తిప్పవేశాడు" అన్నాడు రామం.

వాళ్లంతా "నాగరికులు కదా మరి!"

"ఊఁ, బావుంది, కాని కొంపదీసి వాళ్ళంతా ఇక్కడ డాన్సుచెయ్యడం మొదలెట్టరుగద!"

పార్వతి నవ్వలేదు. బుర్రదించుకుని కాలిగోరుతో నేలనురాస్తూ ఏదో ఆలోచిస్తూంది. ఆ మొహంలో ఏవో వ్యక్తావ్యక్తమైన భావాలు, ఏదో తెలియని అసంతృప్తి కని పిస్తున్నాయి. ఆమె తన భావిజీవితం గురించే ఆలోచిస్తూంది. తన కీ ఏడాదితో ఆనర్సు పూర్తికావస్తూంది. ఆ తరువాత ఏమిటి చెయ్యడం. వివాహం చేసుకోవడం, కాపరం చెయ్య డం. అంతేనా? కాపరంకూడా బాగానే ఉండవచ్చును. అయితే ఈ ఐహిక జీవితానికి పరమావధి ఏది? ఐశ్వర్యమా, విలాసమా? భౌతిక ఆనందమా? కేవలం విలాసాలలో తన కానందం ఆత్మసంతృప్తి కలగదు. కోరేది మానసిక వికాసం, జ్ఞానాన్వేషణ. జ్ఞానమనేది సర్వోత్కృష్టమైనది. అదే జీవితానికి ఆనందాన్నీ, తృప్తినీ, పరిపూర్ణత్వాన్నీ కలి గిస్తుంది. ఈ తృప్తిని తను భావిజీవితంలో పొందగలదా? తన వైవాహిక జీవితం యీ ఆనందాన్ని అందిస్తుందా? వైవాహిక జీవితాన్ని తప్పించుకోలేము. అయితే ఎటువంటి వివాహం. ఎటువంటి భర్త, ఎటువంటి ప్రేమ? పార్వతి బుర్ర ఆలోచనలతో బరువెక్కిపోయింది.

ఆమె తలెత్తిచూసింది. రామం తనవేపే చూస్తు న్నాడు. తనావిధంగా చూడడం ఆమెగ్రహించిందని రామం తెలుసుకుని సిగ్గుపడ్డాడు. అత నింతసేపూ పార్వతిగురించే ఆలోచిస్తున్నాడు. పార్వతి మనస్తత్వం, భావాలు తనకు బాగా తెలుసు. ఆచారితో ఆమె జీవితం ఎలా వుంటుందో అనుకుంటున్నాడు. వారిద్దరిలో భావసమైక్యత ఎలా వుండ గలదు? వారిద్దరివీ విభిన్న సంస్కారాలు, విభిన్న దృక్పథాలు, విభిన్నభావాలు. వారి తాత్వికపునాదులే విభిన్నం. అలాంటి వారి జీవితంలో ఆనందం వుంటుందా? ఛీ ఏమిటీ ఆలోచనలు? దృక్పథాలనేవి శాశ్వతంగావు! వా రిద్దరూ వొకరినొకరు ఇష్టపడినప్పుడు తన కెందుకీ ఆలోచనలు? తనలో ఏమూలైనా ఈర్ష్యగాని అసూయగాని పొంచిలేదుకదా!

"ఏమిటాలోచిస్తున్నావు?" అంది పార్వతి గాలికి ఎగు రుతూన్న తలవెంట్రుకలు సర్దుకుంటూ.

"అబ్బే, ఏమీలేదు. అమెరికా వెళ్ళివచ్చాక ఆచారి చాలా మారిపోయాడు సుమా."

"ఆహా! అంతా మారిపోయింది! ఆ రంగుతప్ప! పాపం, ఆ శరీరపు రంగు మార్చుకోవాలన్నా మారేది కాదాయెను!"

ఇంతలో బండి సింహాచలం స్టేషనుకు వచ్చి ఆగింది. ఆచారీ, ఆయువతీ యువకులూ ఏదో మాట్లాడుకుంటూ నవ్వు కుంటున్నారు. బండి నిలబడగానే వాళ్లూ నవ్వులు నిలబెట్టేరు. అమ్మయ్య! వాన వెలిసినట్లు ఒక్కసారి నిశ్శబ్దమైంది.

చూస్తూండగానే పెట్టెలోకి జనం ఒక్కసారిగా తొం దర తొందరగా ఎక్కిపోయారు. బండి కదలిపోయింది. జనం

లోపలికొచ్చి తమ తట్టలు సర్దుకుంటున్నారు. అంతా పల్లెటూరి ఆడవాళ్ళు.

"ఇదేమిటర్రా, యీ పెట్టె కాదు, దిగండి, పోండి !" అన్నాడు ఆచారి చిరాగ్గా.

"బండి కదలిపోనాదికదా. ఒక్క పది నిమిషాలే బాబయ్యా, ఓట్లేరులో దిగిపోతాం" అన్న దొకామె. ఆమె ఆజానుబాహురాలు. నల్లటి దృఢమైన శరీరం. పెద్ద కళ్ళు. విశాలమైన నుదుటిమీద రూపాయంత కుంకుమబొట్టు. నవ్వితే సొట్టలుపడే బుగ్గలు. ఆరోగ్యవంతమైన సౌందర్యం.

"ఛీ, ఛీ ,మీబాబుగారిసొమ్ములా ఎక్కిపోయారు. పైపెచ్చు మాట్లాడంకూడానా" అని గట్టిగా కేకలేశాడుఆచారి.

"ఎవరి బాబుగారి సొమ్మూకాదు బాబు, సర్కారుబండి. డబ్బిస్తే ఎవడినేనా ఎక్కనిస్తాడు" అంది ఆమె నవ్వుతూ.

"ఛీ, పో, డబ్బిస్తేమాత్రం ఈ వెధవతట్టలన్నీ ఏమిటి బండంతా న్యూసెన్సు" అంటూ ఆచారి ఆముదం తాగినవాడిలాగా మొహం పెట్టేడు.

"తట్టల్లో పాలకుండలు బాబూ, పాలు"

"ఛీ, వెధవపాలు, పాలుట, పాలు"

"ఆ ఎదవపాలు నేకపోతే మీ పిల్లలకి గడవదు బాబయ్యా. అసలు మీకు కాఫీ లెలాఁగొస్తాయ్ బాబూ, కాఫీలు" అంది ఆ స్త్రీ నవ్వుతూ. తక్కిన ఆడవాళ్ళంతాకూడా పకపక నవ్వేరు. ఆచారికి ఒళ్ళు మండింది. మండదూమరి ఏమిటా నవ్వు.

"ఛీ, వెధవముండా, ఇంకా నాతో వాదిస్తావా"

"ఏటి బాబు తిడతావేటి, మంచోడివే" అంది ఆమె చిరాగ్గా. ఈ అల్లరంతా చూసి పార్వతి దగ్గరగావచ్చి "పోనీండి మనకెందుకు వాళ్ళతోటి. వాళ్ళే దిగిపోతారు, తిట్టకండి" అంది.

"నీ కెందుకు మధ్య ఫో, వొట్టి 'స్టుపిడ్'లా మాటాడకు" అన్నాడు ఆచారి కోపంగా. పార్వతి చిన్నబుచ్చుకుంది. నలుగురిలో అలా అంటే ఎవరికేనా ఎలా వుంటుంది మరి. కాని ఆమె మాట్లాడలేదు.

"తల్లి, మాలచ్చిమి, పదికాలాలపాటు పసుపూ కుంకం ఎట్టుకుంటాది తల్లి! చినబాబూ మంచోడే కొంచెం సిరుకోపం గానీ" అంది ఆమె.

"ఛీ, రాస్కెల్, నోరుముయ్"

"ఏటి, తిడతావేటి బాబూ, నే తిడితే ఎలాగుంటాది. సదివినోడివిగదా, గ్యానం లేదూ?"

"వెధవముండ, నీ కళ్ళు నెత్తిమీదికొచ్చాయ్, తిడతానా తంతానా, ఇంకాను" అని ఆచారి కోపంతో ఒళ్ళు మరచి ఆడదాని తట్టమీద కాలుతో తన్నేడు. ఆచారి తొడుక్కున్న బూటు రాయిలాగుంది. అమెరికాలో తయారయింది. మహాగట్టిసరుకు. ఆ తన్నుకి బుట ఎగిరిపడి లోపలి పాలకుండ బద్దలైంది. తెల్లటి, చిక్కటిపాలు పెట్టెసింతా వొలికి ధారలుకట్టి పారింది. ఆడదానికి ఒక్కసారిగా కోపం, ఏడుపు, దుఃఖం పొర్లుకొచ్చాయి.

"ఒలమ్మో సచ్చినోడు పాలకుండ పగలగొట్టేసినాడే, ఓరి వెదవకొడకా, నీకేం పోగాలంరా, నాకొడకా" అని పెద్ద

కేకపెట్టి అరచింది. ఆమె వెక్కి-వెక్కి ఏడవడం మొదలు పెట్టింది. తక్కిన ఆడవాళ్ళు దానిని పట్టుకుని ఊరుకోబెట్టేరు.

విరిగిన కుండ పెంకులు కాలితో తోస్తూ ఆచారి బెంచీ మీదున్న యువతీ యువకులను చూసి నవ్వేడు. వాళ్లు కూడా పళ్ళికిలించి పకపకనవ్వేరు. "వెధవ ముండకి తగిన శాస్తిచేశారు" అంటూ ఆచారి నభినందించేడు యువకుడు.

"అవునండీ, యీ దేశంలోగాబట్టి సరిపోయింది. ఇదే అమెరికాలోనే అయితేనా" అన్నాడు ఆచారి. ఇలాంటి తప్పుకి అమెరికాలో అయితే మరణశిక్షే అయివుంటుంది, అను కుంది యువతి.

"అమెరికాలో ఐతే వెంటనే పోలీసుల్ని పిలిపించి..." అనబోయాడు యువకుడు.

"ఈ మాత్రానికి పోలీసుల్నికూడా ఎందుకండీ, బండీ లోనుంచి క్రిందికి తోసేయడమే" అన్నాడు ఆచారి.

పార్వతికి ఆచారి ప్రవర్తన చాల అసహ్యంగావుంది. నిజమే, వీళ్లు మూడోక్లాసు టిక్కెట్టుకొని ఇంటరులో ఎక్కి వుంటారు. తప్పేకావచ్చును. అయితే యీఆడదానిని శిక్షిం చటానికి ఆచారి కధికార మెవరిచ్చారు. కావాలంటే రైలు వాళ్లతో ఫిర్యాదుచెయ్యాలి. అంతేకాని ఈదౌర్జన్యమేమిటి?

పార్వతి పాలమనిషివేపు తలెత్తిచూసింది. పాలమనిషి చీరకొంగుతో కళ్లనీళ్లు తుడుచుకుంటూంది. కష్టపడి పశువు లను పెంచి, పోషించి, చేతులారా పిదికినపాలు, తెల్లటి, చిక్కటి పాలు, తనకు, అనేకమందికి జీవనాధారమైన పాలు ఇలా నేలచిమ్మి ధారలుగట్టిపోతూవుంటే ఆమె కెలావుంటుంది మరి!

ఆమెలో దుఃఖం పొర్లుకొచ్చింది. తన కన్యాయం చేసిన వాళ్లమీద ద్వేషంతో, ఆగ్రహంతో ఆమెకళ్లు ఎర్రబడ్డాయి. పాపం, మరో పావలాడబ్బు లెక్కవిస్తే యీ పెట్టెలో కూర్చునే అధికారం సంపాదించుకునివుండేది. కాని ఆ పావలా సంపాదించడం ఎంతకష్టం !

ఇంతకీ ఆమె ఏ టిక్కెట్టుకొన్నదో ఆచారికి తెలీదు. కాని వాళ్లు కట్టులోనూ, బొట్టులోనూ, వేషభాషల్లోనూ అనాగరికులు! దరిద్రులు! అలాంటివారు తనతో సరిసమానంగా వచ్చి కూర్చోవడం అతనికిష్టంలేదు. అసలు వాళ్లనిచూస్తేనే అసహ్యమేసింది. వాళ్లకి సభ్యత తెలియదు; తనకే సభ్యత తెలుసును. తనే నాగరికుడు, విద్యావంతుడు. అనాగరికుల మీద తనకు అధికారముంది! వాళ్ల పాలకుండ బద్దలుకొట్టినా తన్నినా, బండిలోంచి తోసేసినా తను నాగరికుడే. అనాగరికులమీద దౌర్జన్యం "నాగరిక" లక్షణం.

వాల్తేరు స్టేషను వచ్చి బండిఆగింది. పాలవాళ్ళంతా తట్టలుపట్టుకు దిగిపోతున్నారు. ఈ పాలమనిషి మాత్రం పొట్టితట్ట చేత్తోపట్టుకుని విచారంగా కూర్చుంది. పార్వతి దగ్గరగా వెళ్ళి "నువ్విక్కడ దిగుతావా?" అని అడిగింది.

"దిగిపోతాను తల్లీ, నీ కెందు కా కష్టం?"

"నీకెంత నష్టమైంది ఇవ్వాళ?"

"ఎనిమిది రూపాయల పాలు తల్లీ. అన్నీ నేలపాలైనాయి. ఏ నా కొడుకుమొగం సూసినానో ఇయాల" అంటూ తట్టపట్టుకొని బండి దిగింది.

"ఏయ్, పాలమ్మీ, మాట, ఇలారా. ఇదుగో ఆయన కోపంమీద అలాచేశారు. విచారించకు" అంటూ పార్వతి పాలమనిషి చేతిలో ఎనిమిది రూపాయలు పెట్టింది. పాల మనిషి పార్వతికి దండంపెట్టి వెళ్ళిపోయింది.

ఆచారి ఇదంతా చూస్తూనేవున్నాడు. కాని మాటాడ లేదు. అటూయిటూ పచారు చేశాడు. తను శిక్షించిన పాలమ్ముకునే పల్లెటూరి ఆడదానిదగ్గర పార్వతి క్షమాపణ చెప్పుకోవడం నిజంగా ఎంత అవమానకరం! ఆచారికి పార్వతి మీద కోపంవచ్చింది. ధుమధుమలాడుతూ బెంచీమీద పైపు వెలిగించి గుఫ్ గుఫ్‌మని పొగవదిలాడు.

ఇద్దరి దగ్గర సెలవుపుచ్చుకుని రామం బండి దిగాడు. పార్వతికూడా చటాలున లేచి నిలుచుని "నేనుకూడా వస్తున్నా ఉండు రామం, నాకూ పనుంది, యూనివర్సిటీకి వెళ్లాలి"అంది.

ఆచారి పార్వతి మొహంవేపు తీక్షణంగా చూసి "నాతో రావా, ఐతే" అన్నాడు.

"క్షమించండి, రాలేను."

ఆచారి మాటాడలేదు. అవమానంతో వొళ్లు మండి పోతూంది. వాళ్ళిద్దరూ గేటుదాటి బయటకి వెళ్లడం కిటికీ లోంచి చూశాడు.

"ఒట్టి మూర్ఖులు, అనాగరికులు" అనుకున్నాడు ఇంగ్లీ షులో ఆచారి. కాని అతనిమనస్సుకు శాంతికలుగలేదు. ప్రక్కనున్న పత్రిక తీశాడు చదువుదామని. పత్రిక మీదున్న హాలీవుడ్ సినీమాతార తన్నుచూసి నవ్వుతున్న ట్లనిపించింది ఆచారికి.

---

# విశ్వకర్మ

గంగయ్య ఉదయాన్నే లేచి స్నానంచేసి, వొంటికి విభూతికట్లు, నుదుట కుంకంబొట్టు పెట్టుకుని, బాడిత చేత పుచ్చుకుని, గడపదాటి వీధిలోకి వచ్చాడు. అతనికి ఒకే ఒక సమస్య. ఆ రోజు కూలి సంపాదించి, కడుపులో ఏమైనా వేసుకోవాలి. అంతకుమించి అతనికి కావలసినదేమీ లేదు. కాని అన్నిటికన్న అదే చిక్కు సమస్య. ఈ సమస్యా పరిష్కారార్థమై బయలుదేరేడు.

శీతకాలం కావడంవల్లనూ, ముడుతలుపడిన శరీరం మీద సరియైన బట్ట లేకపోవడంవల్లనూ, కొంచెం చలివేసింది. గంగయ్యకు గడచిన జీవితం ఒక్కసారి జ్ఞాపకంవచ్చింది.

తను యవ్వనంలో వున్నప్పుడు మంచి బలశాలి. ఎంత చలికాలమైనా తెల్లవారుగట్ల నాలుగో గంటకు లేచి చన్నీళ్ళ స్నానం చేసేవాడు. ఎప్పుడూ ఇంత చలి అనిపించలేదు. శుభ్రంగా స్నానంచేశాక, విభూతికట్లుపెట్టి, దైవప్రార్థన చేసుకుని, బట్టలేసుకుని, భుజంమీద ఎర్రటి సిల్కువోణీ గాలికి రెపరెపలాడుతూంటే, మీసం మెలివేస్తూ, మందగమనంతో మెల్లిగా అడుగులువేసుకుంటూ వీధిలోకి వచ్చేవాడు. ఎవరైనా దారిలో పలకరించి "ఎక్కడికోయ్" అని అడిగితే, ఏ మిల్లులో పనికో, ఏ మేడ కట్టడానికో అని చెప్పేవాడు. అసలు డమేకాదు పనిచేసి చూపించేడు లోకానికి. మాటమీద మాటొచ్చి పంతంమీద పట్నంలో ప్లీడరుగారిల్లంతా తన

వొక్క చేతిమీదే కట్టిచూపించేడు. నలుగురి పని ఒక్కడే చేసేవాడు. లాల్చీ విప్పి, చేత్తో రంపంపట్టుకుని చూపుబల్ల కోస్తూంటే చెమటపట్టిన శరీరం ఎండకి నిగనిగ మెరిసేది. కండలు వెనుకక్రరలా పెళపెళమనేవి. సాయింత్రమయే సరికి రెండు మూడు రూపాయలు కళ్లజూసేవాడు,

వెధవ డబ్బు. బాడితపడితే రూపాయి. రంపంపడితే రెండు. చిత్రికపట్టేడంటే ఎలాంటి పేడైనా అద్దంలా తళతళ లాడేది.

"మనం సిత్రికపడితే బల్లసెక్కమీద నీడ కనిపించేది కద. అదీ, పనోడితనమంటే! సీ, యిప్పటోల్లకి పనే సేతకాదు" అనుకున్నాడు మనసులో గంగయ్య.

అంతవర కెందుకు? తన కొడుకు చేస్తున్నాడు పని, చూస్తున్నాడుగదా తను. లేక లేక ఒక్క కొడుకు. వాడిని యీ చుట్టుపట్ల ఊళ్లన్నిటికీ గొప్ప పనివాడిగా చెయ్యాలని ఎంతో తాపత్రయపడ్డాడు తను. కాని తల్లే వాడిని ముద్దు చేసి పాడుచేసింది. వెధవ! పోకిరీ అయిపోయాడు, పెళ్ళిచేస్తే దారికొస్తాడని వాడి తల్లి పోరుపెట్టింది. పెళ్ళి చేశాడు. వెంటనే వాడు పెళ్లాన్ని తీసుకుని వేరైపోయాడు. ఆ వెధవ తిరిగిన తిరుగుళ్ళు చూడకుండా ముసిలిదాని కళ్ళు పోయాయి,

ఇప్పుడు తన శరీరం ముడతలుపడింది. ఒంట్లో శక్తి తగ్గి పోయింది; దృష్టి సమంగా ఆనదు. రోజులు గడవడం కష్టమై పోయింది. ముసిలిది అదృష్టవంతురాలు, వేగమే వెళిపోయింది. తను ఆశలుపెట్టుకున్న కొడుకు కలా అయిపోయాడు. తన కేం

కెవ్వరూ లేరు. తనొక్కడే. తనొక్కడికీ రోజుకి పావలో అర్థో దొరికితేచాలు. కాని అది దొరకడమే కష్టమైపోయింది.

బాడిత భుజానవేసుకుని నాలుగు వీధులమధ్య రామ మందిరందగ్గరికి వచ్చాడు గంగయ్య. మందిరంవేపు తిరిగి దండం పెట్టుకున్నాడు.

అక్కడే కనిపించాడు వెంకడు. వెంకడు సన్నంగా పొడుగ్గా ములంకాడలా ఉంటాడు. దూరంనుంచే వెంకడ్ని పోల్చుకోవచ్చును. వాడిని చూసీ చూడనట్టు పక్కకు తిరిగి గబగబ అడుగులువేశాడు గంగయ్య. అయితే వెంకడు వెనక నుంచి గంగయ్యచెయ్యి పట్టుకున్నాడు.

"ఏటి గంగయ్యా తప్పుకు తిరుగుతున్నావ్. అప్పు తీసి కెళ్ళిన డబ్బులు తిరి గియ్యక్కర్లేదేమిటీ? ఏటి ఎగేసేద్దామనే" అన్నాడు వెంకడు.

"పారేస్తాను నేరా, యింతోటి అప్పూను. పావలా డబ్బులికి యీాదిలో నిలబెట్టేసినావు. మాంచి పెద్దమనిసివే," అన్నాడు గంగయ్య చెయ్యి విదిలించుకుంటూ.

"ఎవరు నువ్వా నేనా? ఆ పావలాడబ్బులుకోసం ఒచ్చి బతిమాలి వొట్టికెల్లినావ్. ఏటి, అంత యిస్నాకారమైతే పారేరాదూ. పావలాడబ్బులట! పావలాడబ్బులు! ఏం వృత్తినే వొచ్చినాయేట్టి డబ్బులు! తే, పడీ" అని అల్లరిపెట్టేడు వెంకడు. వెంకడు పాపం మంచివాడే. కాని డబ్బు లెవడు వదులుకుంటాడు.

"నా కాడిప్పు డేటి నేదు సుమా. ఇచ్చేస్తాను నేరా, నీడబ్బు లెవడికి కావాలి"

"ఇలా సాలకాలమైంది నాయనా, నీ మాయలు నా కాడ తీసి" అని వెంకడు భుజంమీది బాడిత లాక్కున్నాడు. "నా డబ్బులిచ్చి నీ బాడిత పట్టుకెళ్లు, అంతే."

"నాయన్నాయన, నీ పున్నెముంటాదిరా బాబూ. సాయింతరం నీ డబ్బులు నీ కిస్తారా. బాడిత నాక్కుంటే యిక నే తినేదేటి? ఒగ్గిరా నాయనా," అని బతిమాలుకున్నాడు గంగయ్య.

ఈ తగువు వినడానికి నలుగురు పెద్దమనుషులు మూగేరక్కడ. వారంతా గంగయ్యమీద జాలిపడ్డారు.

"ఆడికా డేటుందిరా, ఆడి నోట్టుకున్నావ్" అన్నాడొక పెద్దమనిషి.

"ఆ, నేను. నేకపోడమేటి? క్లబ్బులో కూసుని టీనీల్లు తాగడానికుంది" అన్నాడు వెంకడు.

అప్పు డప్పుడు బియ్యానికి డబ్బులు లేకపోతే, పట్నమెళ్ళే రోడ్డుమీదున్న క్లబ్బులో అణా ఇచ్చి టీ తాగేస్తాడు గంగయ్య. కాని ఊళ్ళో చాలామందికి టీ తాగడం విలాసం. బియ్యానికి డబ్బులేక టీ నీళ్ళు తాగుతూ వుంటానని చెప్పుకోవడం యిష్టంలేకపోయింది గంగయ్యకి. సాయింత్రం ఎలాగైనా డబ్బులు తెచ్చియిస్తాను బాడిత వదిలీమని బతిమాలేడు. గంగయ్య సాయింత్రం డబ్బులు తెచ్చి యివ్వడానికీ, వెంకడు గంగయ్యను వదిలిపెట్టడానికీ పెద్దమనుషులు తీర్పు చెప్పేరు.

గంగయ్య మళ్ళీ భుజంమీద బాడితవేసుకుని నడక ప్రారంభించేడు. ఇవాళ ఒక పావలాడబ్బులు సంపాదించి అప్పు తీర్చాలి. ఈ వెధవ ఊళ్లో పావలా కూలి ఎలా దొరుకు

తుంది. నాలుగు బ్రాహ్మణ కొంపలు, రెండో మూడ
రాజుల, కోమట్ల కొంపలు ఉన్నాయి. తక్కినవాళ్ళంతా
కాపు, గొల్ల, సాలె, కంసాలి, చాకలి మంగలి, మాల, మాదిగ
కులాలవాళ్లు. వీళ్ళ కొంపల్లో వడ్రంగివాడికి కూలిచ్చి చేయి
చుకునే పను లేమిటుంటాయి. వాళ్ళకే తిళ్లు లేక ఏడుస్
న్నారు. వాళ్ళంకొకరికి పెట్టేదేమిటి? పోసి రాజుల ఇళ్ళకి
వెళదామా అంటే అక్కడమాత్రం ఏం దొరుకుతుంది. వా
ఇళ్ళేమో పెద్దపెద్దలోగిళ్ళే. కాని వాళ్లంతా ఆస్తులు పాస్తు
అన్నీ హరించుకుపోయి, ఏదో గుట్టుగా బదుకొస్తున్నార
ఆ లోగిళ్లన్నీ ఒకమూల పడిపోతున్నాయి. ఇళ్ళమీంది పె
కులు రాలిపోతున్నాయి. గోడల పగుళ్ళలో చెట్లు చేమ
మొలుస్తున్నాయి. పాపం! వాళ్ళ స్థితి అలావుంది. ఇ
ఏమైనా ఆశవుంటే బ్రాహ్మణకొంపల్లోనే. అసలు సామె
వుంది. పని లేకపోతే బాపనవీధికి వెళ్లమన్నారు. ఇం
కొచ్చిన ప్రతివాడికీ ఏదో పని పురమాయిస్తారు. అయిత
పనిచేయించుకొని డబ్బు లివ్వడానికేడొతారు. బతిమాల
కుంటే గంజో కడుగో పడేస్తారు. కాని తనకి పావలాడబ్బుల
అవసరం. కడుపులో ఏమైనా వేసుకోడానికి మరో పావలా
డబ్బులు కావాలి. ఇవాళ అర్ధరూపాయి సంపాదించాలి
ఎలాగ. ఈ ఊళ్లో అసాధ్యం. పట్నంపోవాలి. ఇక్కడి
మూడుమైళ్ల దూరం. తను అంతదూరం నడిచివెళ్ళి, కూలి
చేసి పట్టుకొచ్చేదేమిటి? ఇప్పటికే బాగా ప్రొద్దెక్కిపోయింది.
సరే, ముందు బ్రాహ్మణఇళ్ళకు వెళ్లి ప్రయత్నించి చూడాలి.
అనుకుని బ్రాహ్మణవీధికి వెళ్ళేడు గంగయ్య.

మొదటి మూడిళ్లలోనూ ఏమీ పనిదొరకలేదు. నాలుగో ఇంటికి వచ్చాడు. శీతకాలపు ఎండ చుర్రున తగులుతూంది. గంగయ్య అప్పుడే అలసిపోయాడు. కొంచెం అలసట తీర్చుకుందామని ఇంటి అరుగుమీద చతికిలబడ్డాడు. కడుపులో క్రిందటి రాత్రినుండి ఏమీ లేదు. ఆకలి వేస్తూంది. గంగయ్య కేమీ తోచడంలేదు. బుర్రలో ఎటువంటి ఆలోచనా లేదు. అత నెప్పుడు ఆలోచించినా తనగురించే ఆలోచిస్తాడు. కడుపు అగ్నిహోత్రంలా మండుతూంది. ఏమైనా లోపల పడాలి. అదే అతని ఆలోచన. అంతకుమించి అతని కే గొడవా అక్కరలేదు.

ఎదురుగుండా దూరాన్న వేపచెట్టుకింద ఎవరో పదిమంది మూగేరు. ఏమీ లేదు, గొర్రెపోతును వేటేశారు. అంతే. గొర్రెపోతుచర్మం వొలిచి, చెట్టుకొమ్మకు బాగా కిందికి వేలగట్టి, మాంసం తీసి బండరాయిమీద వంతులు వేశారు. ఒక్కొక్కరువచ్చి మాంసం మర్రిఆకులలో పెట్టి పట్టుకుపోతున్నారు. ఒకడు తల, యింకొకడు కాళ్లు పట్టుకు పోయారు. చర్మంకోసమని వచ్చిన చమారివాడు, కొంచెం మాంసం పడేయమని ప్రాధేయపడుతూ నిలుచున్నాడు. ఈ దృశ్యాన్ని గంగయ్య తదేకదీక్షగా చూస్తున్నాడు. మాంసం రుచితగిలి చాలకాలమైంది. తింటే కార్జం తినాలి! ఏమి రుచి! గంగయ్యకు నోరూరింది. మరో పదినిముషాల్లో మాంసం పంపకం అయిపోయింది. ఎవరిమానాన్ని వారు పోయారు. గంగయ్యలేచి, మెల్లిగా అడుగులు వేసుకుంటూ ఇంట్లోకి

వెళ్ళి సావిడిలో గుమ్మంలో నిలబడ్డాడు. లోపల ఎవరో పడమటింట్లో వండుకుంటున్నారు.

"అమ్మా, నరసమ్మగోరూ" అని పిలిచేడు గంగయ్య. నరసమ్మ వంటింట్లోవుంది. ఆవిడ రాలేదు. అయితే పక్క గదిలోవున్న కోడలు కాంతమ్మ వచ్చింది.

"ఏం గంగయ్యా, ఇలా వచ్చావు" అని ప్రశ్నిస్తూ. కాంతమ్మ వాకిట్లో ఎండలో మంచంమీద కూర్చొబడి, జడ విప్పుకోటం మొదలుపెట్టింది.

"ఏం నేదమ్మా, పనేమైనా వుందేమోనని" అంటూ గంగయ్య సావిడిగుమ్మందాటి లోపలికొచ్చి కూర్చున్నాడు.

"మాయింట్లో ఏమీ పనిలేదే. ఏం, ఇవాళ ఎటూ వెళ్ళలేదా ఏమిటి?"

"నేదమ్మా, ఎటూనేదు. నిన్నటినుంచి పనీనేదూ పాటూనేదు ఏదైనా పనుంటే యియ్యండమ్మా, సేస్తాను"

"మాయింట్లో ఏమీ లేదోయ్"

"సేకపోవడమేటి, ముసలమ్మగోరిని పిలవండమ్మా, మీకేటి తెలుస్తాది" అని గంగయ్య వాకిట్లోవున్న మంచాల వేపు చూసేడు, దేనికైనా మరమ్మత్తు అవసరమేమోనని. "ఇంట్లో నలుగురు కుర్రవాళ్ళున్నారు, మంచాలేనా ఇరగ్గొట్టరు నాయనలు" అనుకున్నాడు గంగయ్య.

"అమ్మా, నరసమ్మగోరూ" అని కేకవేశాడు గంగయ్య. పడమటింట్లోనుంచి నరసమ్మ బయటికి వచ్చింది. కోడలు ఎండలో కూర్చునివుండడం చూసి, 'అదేమిటమ్మా, వాకిట్లో కూర్చున్నావ్. శీతకాలపు ఎండ ఒంటికి మంచిదికాదు.

అరుగుమీద కూర్చో వెళ్ళి" అంది. కాంతమ్మ లేచి చీడీమీద కొచ్చి కూర్చుంది.

"ఏం గంగయ్యా ఇలా వచ్చావు" అంది నరసమ్మ.

"ఏం లేదమ్మా, కొంచెం కాఫీ నీల్లుంటే ఇప్పించం డమ్మా" అన్నాడు గంగయ్య, స్వభావానికి జారబడుతూ. గంగయ్యకు ఆకలి దంచేస్తోంది.

"బాగుందిరా నాయనా, ఇప్పుడేం కాఫీ, మా భోజనా లయిపోతేను" అంది నరసమ్మ.

"అమ్మ, మీకు ఫన్నెముంటాది తల్లీ. కడుపులో కావయ్య కయ్యి, కుయ్యిమంటున్నాడు."

"ఇప్పుడు కాఫీ లెక్కడివి గంగయ్యా, నీకేం వెర్రా ఏమిటి?" అంది కాంతమ్మ ఊడివస్తూన్న జుత్తు దువ్వెన పళ్ళ లోంచి తీసి పరిశీలిస్తూ.

"చూసేరా అత్తయ్యా జుత్తు ఎలా ఊడిపోతోందో" అని ఊడిన వెంట్రుకలు అత్తగారికి చూపించింది కాంతమ్మ.

"అవునమ్మా నీకు జాగ్రత్త లేదు. నీళ్ళాడి మూడు వారాలు కాలేదు. అప్పుడే ఏదిబడితే అది తినేస్తున్నావు, పత్యం చెయ్యకపోతే ఎలా చెప్పు? ఒళ్ళు జాగ్రత్తగా చూసుకోకపోతే ఎలాగే! ఏం చిన్నపిల్లవా?" అని కేకలేసింది అత్తగారు. జుట్టు ఊడిపోవడానికి పత్యం సరిగా చెయ్యకపోవడానికీ సంబంధ మేమిటో కాంతమ్మకు సరిగా బోధపడలేదు, కాని మాటాడకుండా ఊరుకుంది. గంగయ్య కునుకుపాట్లు పడుతున్నాడు. పిల్ల వెంట్రుకలు పోతున్నాయని ఏడుస్తున్నారు, తన ప్రాణాలే పోతూవుంటేను. వెధవ వెంట్రుకలు ఊడిపోతే పోనీరాదూ.

నూనె కర్చు మిగులుతుంది అనుకున్నాడు గంగయ్య. నర సమ్మ గంగయ్యవేపు చూసింది. "నాగమ్మకు ఆకలేస్తూంది కాబోలు పాపం" అంది కోడలితో. కాంతమ్మ నవ్వింది.

"గంగయ్యా, గంగయ్యా" అని పిలిచింది నరసమ్మ.

"ఏటమ్మా, కాపీ నీళ్లేటి..." త్రుళ్ళిపడి లేచాడు గంగయ్య.

"కాఫీ లేదుసుమా. పోనీ కొంచెం చద్దివణ్ణం ఉంది తింటావా?"

"ఛ, అదేటమ్మా, ఇప్పటికి నా జలమలో మా కుల మోళ్ళదగ్గర తప్ప ఎక్కడా పచ్చి మంచినీల్లయినా తాగ నేదు. కులస్థుడినికదా, మీఇంట్లో సలిదిగంజి తాగమంటారా?"

"చాల్లేరా, దిక్కుమాలినకులం. అలా పెరట్లో నూతి దగ్గర కూర్చుని తినీ, ఎవరూ చూడరులే" అంది నరసమ్మ.

కాంతమ్మ పకపక నవ్వింది. "తిన కేం చేస్తాడత్తయ్యా, ఈ వూళ్లో వీళ్ళవాళ్ళందరూ మాంసంకూడా తినేస్తారట"

"ఛ, ఛ. ఈరబ్రెమ్మం తోడమ్మా. వూళ్లో జాత్తి కక్కువ వెధవలెవరో తింటే అందరినీ అనేస్తారేటి, మంచోరే"

"పోనీలేరా, ఓ చిన్నపని చేసిపెడుదూ. నాలుగు మెతు కులు పడేస్తాను, తిని, వీధరుగుమీద పడుకుందువుగాని" అంది నరసమ్మ.

"ఆ. సెప్పండమ్మా, ఏం పని?" అని చేత్తో బాడిత తీసి పట్టుకున్నాడు.

"బాడితపని గాదురా నాయనా, ఎల్లుండి మా ఇంట్లో మా పిల్లడి బారసాల"

"ఉయ్యాలమంచం సెయ్యమంటారేటి. నే సేసిన వుయ్యాలలో బొట్టెడిని తొంగోపెట్టం డమ్మా, గొప్పోడై పోతాడు. సూసినారా, పట్నంలో ఇనసిపెక్టేరుగారింట్లో పిల్లలందరూ నే సేసిన మంచంమీదతొంగున్నవోరే. ఇప్పుడెంతేసి వోరైనారు. ఒకడు వొకీలు, ఒకడు తాసీల్దారు, ఒక డేపో సాలం పెద్ద ఉద్యోగం ...'గంగయ్యా, నీ సేతిసలవరా' అంటా దిప్పటికీ ఆ తల్లి మాలచ్చిమి. పని సేసినామంటే ఆల్లిచ్చే మజూరీ ఉండిపోతాయేటి. పేరుండిపోతాదిగాని"

"మాకిప్పుడేం వద్దుగాని, ఓ చిన్నపని చెయ్యాలి, చెయ్యగలవా?"

"సెప్పండమ్మా, పనిమంతుడు సెయ్యలేని పనేటి?"

"ఎల్లుండి మా యింట్లో మా మనమడి బారసాల. నాలుగు కొబ్బరికాయలు తీసిపెడుదూ"

"ఏటీ కొబ్బరిసెట్టెక్కమంటారా, మంచోరే. నా సేతకాదమ్మా. ఏతోడిని పిలవండి"

"నాయన్నాయన, నా బాబువు కావూ. ఏత వెధవ అత్తారింటికి పోయాడురా. పదిరోజులదాకా రాడట.

"ఇదేటమ్మా, నన్ను సెట్టెక్కమంటారేటి, నా వురుతి కాదది"?

"బాబ్బాబు, నీ కో బేడ డబ్బు లిచ్చుకుంటానురా. కాయలన్నీ కోతులు పాడుచేసేస్తున్నాయి. ఎల్లుండి బారసాల కూడాను."

గంగయ్యకు ఆశ పుట్టింది. చల్దిఅన్నం కడుపులో పడుతుంది. వూరగాయ నంజుకుంటే మహారుచిగా వుంటుంది.

ఇప్పు డింత కడుపులోపడితే మళ్ళీ రాత్రివరకూ పచ్చి మంచి నీళ్ళయినా తాగక్కరలేదు. తరవాత బేడ డబ్బు లిస్తా నంటూంది ముసిలిది. ఇవాళ రాత్రి, రేపు పొద్దున్నా టీనీళ్లు తాగవచ్చును. అన్నట్లు వెంకడి అప్పో? సరే బేడడబ్బులు చేతిలో పడినతరవాత ఆలోచించవచ్చును.

"అయితే పడేండమ్మా నాలుగు మెతుకులు"

"నాలుగు కాయలు కోసి వెళిపోరాదా, తరవాత సావ కాశంగా తిందువుగాని. ఇప్పుడు తింటే ఆయాసంతో పడు కుంటావ్,—మరి నువ్వు కాయలు కోసేదేమిటి? వెళ్ళు. ఎంతసేపు, అయిదునిముషాల పని" అని దబాయించింది నర సమ్మ. అవును, లేకపోతే చెట్టెక్కడు వెధవ. ఇలాంటి వాళ్ళతో పనులు చేయించుకోవడంలో నేర్పు వుండాలి, అను కుంది నరసమ్మ.

"పోనీ కొంచెం సుద్ది దాహం యిప్పించడమ్మా" అన్నాడు గంగయ్య. నరసమ్మ మజ్జిగనీళ్లు తెచ్చి చెంబులో పోసింది. గంగయ్య చెంబెడు మజ్జిగ తాగి, జర్రున తేన్చి, పెరట్లో కొబ్బరిచెట్టుకిందికి వెళ్ళి నిలుచున్నాడు. చెట్టు పొడుగ్గా, స్తంభంలా నున్నగావుంది. దీన్ని తెగగొయ్యా ఎంత ఎత్తుంది అనుకున్నాడు గంగయ్య. పనివిషయంలో గంగయ్య ఎన్నడూ ఓటమిని వొప్పుకోలేదు తన శక్తి సామర్థ్యాలమీద అతనికి ఎంతో విశ్వాసముంది.

కాళ్లకు తాడు. మొలకు ఆవుకన్ను కట్టుకుని, కొయ్య డానికి కత్తిలేకపోవడంవల్ల బాడిత భుజాన్నివేసుకుని, చెట్టు ఎక్కడం ప్రారంభించేడు, అలవాటులేని పని, మొదట్లో

చాల కష్టమయింది. కాని మొండి పట్టుదలపడితే సాధ్యం కానిదంటూ వుండదు. మీాద కెక్కిపోయి కాయులు కోశాడు. కిందనున్న సరసమ్మ కాయలు ఏరి తట్టలో పెట్టింది.

"చాల్లే గంగయ్యా, ఇక దిగు" క్రిందనుంచి కేక వేసింది సరసమ్మ.

గంగయ్య బాగా అలసిపోయాడు. దాహం వేస్తూంది. ఒక్కత్రుటి ఆగి నాలుగుప్రక్కలా చూసేడు. వూరంతా కనిపిస్తూంది. దూరాన పొలాలు, కళ్ళాలు కనిపిస్తున్నాయి. చెరువు వొడ్డున కళ్లంలో రైతులు అంబలి తాగుతున్నారు. గంగయ్యకు చద్దిఅన్నం, వూరగాయ జ్ఞాపకమొచ్చింది. అంతే, అతని కళ్ళు చీకట్లుకమ్మేయి. వూరూ, పొలాలు, కళ్లం ఏదీ కనబడడంలేదు. "అమ్మో" అని కేకవేశాడు.

కిందనున్న రాయిమీాద మోసింది గంగయ్య తల. అతని మొహం అతిప్రశాంతంగా వుంది. చేతిలో బాడితను పట్టు విడవలేదు. గంగయ్య మరణించేను. కాని గంగయ్య విశ్వకర్మ. విశ్వకర్మకు చావేమిటి ?

—o—

# ప్రయోజకత్వం

గోపాలం పెళ్ళానికికూడా లోకువయిపోయాడు. లోకులకు మరీ లోకువయిపోయాడు. తను బి. ఏ. పాసయి, పన్నెండేళ్లయి ఉద్యోగం చేస్తున్నాడు. కాని గొర్రెతోకలా ఆ ఉద్యోగానికి ఎదుగూ బొదుగూ లేదు. అంటే తనకి లేదన్న మాట. ఎనిమిదేళ్ల కూతురు బడికి వెళుతూన్న పిల్లకదా! ఇంటోపడివుంటే పెళ్లానికి చీర కొనలేకపోయినా, పిల్లకి రెండు పరికిణీలయినా మంచివి కొనాలా మరి. అయితే ఈ రోజుల్లో బట్టలు కొనడమంటే మాటలా? ధరలు మండిపోతున్నాయి. "మొన్న కుట్టించిన చుక్కల పరికిణీ వుండాలిగా. అదేమయింది?" అన్నాడు గోపాలం చిరాగ్గా.

"మొన్నేమిటి మొన్న, ఆర్నెల్లయింది. ఇంకా కూచుంటుందా?" అన్నాది భార్య సావిత్రి. ఆ రోజు సావిత్రి మనసు చాలా చిరాకుగావుంది. పొద్దుటే పాలమనిషి పాత బాకీ తెమ్మని దెబ్బలాడి వెళ్ళింది. ఉట్టిమీద పెరుగు పిల్లి తిరగదోసింది. పెద్ద పిల్లడికి జ్వరం తగిలింది. చేతివాడు—వెధవకి రెండేళ్ళేనా లేవు. కాని మహా పెంకి. మరుగుతూన్న కాఫీనీళ్ళు కాళ్లమీద పోసుకుని కాల్చుకున్నాడు. పెద్దపిల్ల కొత్తపరికిణీ కావాలని ఏడిచి నానా అల్లరీపెట్టి బడికి వెళ్లడం మానేసింది.

"ఆర్నెల్లకే చిరిగిపోయిందా పరికిణీ?" అన్నాడు గోపాలం ఏం మాట్లాడాలో తెలీక.

"పరికిణీ అన్నది మరి చిరగదేమిటి ? అదేం రాయూరప్పా ?"

అవును మరి. రాధ బడిలో పలకమీద వుమ్మితడిచేసి, చేత్తో రాసి పరికిణీతో తుడుస్తుంది. మట్టిలో చేతులుపెట్టి పరికిణీకి తుడుస్తుంది. దీన్నంతటినీ భరిస్తూ ఎంతకాలముంటుంది పరికిణీ అన్నది. అదేం రాయూరప్పా? గోపాలానికి కూతురుమీద కోపమొచ్చింది.

"వెధవముండ, బడి ఎగ్గొట్టడానికి ఏదో నాకు చూసుకుంటుంది. ఆ చిరిగిన పరికిణీ వేసుకు వెళ్ళు ఇవాళకి. ఫరవాలేదు" అంటూ కూతురిమీద కళ్ళెఱ్రజేశాడు. రాధ మళ్లీ ఏడుపు లంకించుకుంది.

"చిన్నముండ, దానిమీ దెందుకా కోపం. బడిలో నలుగురూ నవ్వుతారని దాని ఏడుపు" అంది సావిత్రి.

గోపాలాని కేమీ తోచలేదు. పిల్లల్ని కోప్పడితే ఇలా అంటుంది. ముద్దులాడితే, ఇలా ముద్దుచేసే వాళ్ళని పాడుచేస్తున్నా రంటుంది. ఏమిటిదారి? ఏమిటి మాట్లాడాలో తెలీక "సరేలే, సాయింత్రం బజారుకువెళ్లి కుట్టించుకుందాం. "ఏడవకు మరి" అన్నాడు రాధ చెయ్యిపట్టుకుని. "మహా కుట్టించారులెండి! మీ చొక్కా కోటూ సంగతేదో మీరు చూసుకుందురూ చాలు! దాని సంగతీ, నాసంగతీ నే చూసుకుంటాను. లే, అమ్మా లే, ఏడవకు, రేపు మామయ్యకు కబురుపెట్టి నాలుగు పరికిణీలు కుట్టిస్తాలే" అంటూ కూతుర్ని చేరదీసింది సావిత్రి.

"నా చొక్కా కోటూ విషయంతప్ప తక్కిన సంసార మంతా నీ తమ్ముడే భరిస్తున్నట్టు మాట్లాడతావేమిటి?"

"భరించినా వాడు భరించగలడు. వాడికేం మహా రాజు, నాలుగొందలు జీతం" అంది సావిత్రి.

వాళ్ల తమ్ముడికి కలకత్తాలో ఏదో కంపెనీలో వుద్యోగం. రెండువంద లిస్తారు. సావిత్రి తన దగ్గరకూడా నాలుగు వందలని కోతలు కోస్తుంది. ఏదో, భోజరాజు మొహంచూస్తే కవిత్వం పుట్టేదిట, తన మొహం చూస్తే కోతలు పుడతాయి కాబోలు! రామ! రామ! ఏ మన్యాయం! అనుకున్నాడు గోపాలం.

"నేను రేపు మా అక్కయ్యగారింటికి వెళ్ళి ఒక నెల రోజులుండి వస్తాను" అంటూ కూతురి రెక్కపట్టుకుని వంటింట్లోకి వెళ్ళింది సావిత్రి. గోపాలానికి ఏమిటి మాట్లాడాలో తెలీక రెండు నిముషాలు ఆలోచించేడు. ఏం మాట్లాడితే ఏం ప్రమాదమోనని భయం.

సావిత్రి వంటింట్లోంచి తనకి వినబడేలాగ, "నిజంగా వాళ్ల సంసారంచూస్తే ముచ్చటేస్తుంది. మా బావ హాయిగా నెలకు నాలుగైదువందలు తెచ్చి యింట్లోపోస్తాడు. మనకంటె ఎవరేనా నయమే యీ లోకంలో" అంది.

గోపాలానికి భార్యమీద కోపమొచ్చింది. "అయితే నువ్వుకూడా మీ బావదగ్గరకే వెళ్లి వుండలేకపోయావ్" అందా మనుకున్నాడు. కాని అంతమాట అనలేడు. సావిత్రి ప్రతిరోజూ ఏదో విధంగా తన అసమర్థతను జ్ఞాపకం చేస్తూ వుంటుంది.

సావిత్రిపుట్టింటివారు ఒకప్పుడు భాగ్యవంతులు. ఆవిడ తండ్రి ప్లీడరీచేసి బాగా డబ్బు ఆర్జించి మరీ చచ్చిపోయాడు. కాని ఆ ఆస్తి చాలవరకు పోయింది. అయినప్పటికీ తన తండ్రి ప్లీడరీ చేశాడనీ, తన అన్నదమ్ములు, బంధువులు మంచి వుద్యోగాలు చేస్తున్నారనీ ఆవిడ గర్వం. తన భర్త తన కుటుంబహోదాకు తగినవాడు కాడనీ ఆవిడ అభిప్రాయం కాబోలు.

పెళ్లయిన మొదటిరోజుల్లో భర్తంటే సావిత్రికి మంచి గౌరవముండేది. చదువుకున్నవాడనీ; పెద్ద ఉద్యోగం చెయ్యగలడనీకలలుకంది. కాని రానురాను అతనిలో నమ్మకం పోయింది. అతను బి. ఏ. పాసయ్యాడన్న విషయం మరచిపోయింది. "అవును మరి, డబ్బు సంపాదించలేని తరువాత ఎందుకొచ్చిన చదువు, దిక్కుమాలిన చదువు" అన్నాడు గోపాలం. తను వొట్టి అప్రయోజకుడు. తన అప్రయోజకత్వమంతా పిల్లల్ని కనడం తప్ప యింకేముంది? గోపాలానికి తనమీద తనకే జాలేసింది.

గోపాలం వీధిలో అరుగుమీద కూర్చుని తీవ్రంగా ఆలోచించాడు. తన స్థితి కళ్ళకు కట్టినట్టుంది. లోకంలో డబ్బు ఆర్జించలేనివాడు వొట్టి అప్రయోజకుడు; చెల్లనిరూపాయి. అయితే తనకీ సంగతి తెలియకకాదు. తను బి. ఏ. పాసయిన తరువాత పెద్దవుద్యోగం చెయ్యాలనీ, దర్జాగా హాయిగా బతకాలనీ ఎన్నోకలలుకన్నాడు. అయితే ఆ పెద్ద వుద్యోగం సంపాదించడ మెలాగో తెలియలేదు. తనకంటె తక్కువ చదువుకున్నవాళ్లు పెద్ద వుద్యోగాలు, ప్రమోషన్లు,



ఎలా సంపాదిస్తున్నారు? డబ్బు ఎలా గడిస్తున్నారు? వాళ్లకి సిఫార్సు లుండివుంటాయి; లంచాలు కట్టివుంటారు; అధికారుల యిళ్లకువెళ్ళి సేవచేస్తారు; హాయిగా లంచాలు పుచ్చుకుంటారు. తనెందుకు చెయ్యగూడదు? ఛీ! ఇవన్నీ వెధవపనులు! అయితే ఏం? వాళ్ళీ వెధవపనులుచేసి బాగుపడ్డారు. తను మడిగట్టుకు కూర్చుని ఏమిటి సాధించేడు? పెళ్లాంచేత చీవాట్లు తప్ప!

తనతోబాటు చదువుకున్న విశ్వనాథం తాశీల్దారైనాడు. రంగనాథం వ్యాపారంచేసి కారు కొన్నాడు. తనతోడల్లుడు రామారావు గుమాస్తాపని చేస్తూ అప్పుడే యిల్లు కట్టించేడు. భూములు కొన్నాడు. పబ్లిక్‌గా లంచాలు పుచ్చుకుంటాడు. కాని ఆశ్చర్యం! వాడికి ఊళ్ళో ఎంత గౌరవం! వీళ్ళంతా డబ్బు ఎలా సంపాదిస్తున్నారు? ఈ చిదంబరరహస్యమేమిటో తనుకూడా తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు గోపాలం.

డబ్బు సంపాదించడానికి గల మార్గాలేమిటని ఆలోచించేడు. ముందు అధికారిమంచి సంపాదించాలి. వారింటికెళ్ళి సేవచెయ్యాలి. లంచమివ్వాలి. లంచమివ్వడానికి తన దగ్గర డబ్బులేదు. అసలు రూలుప్రకారం తను యితరులదగ్గర డబ్బు లంచాలు పుచ్చుకొని అందులో కొంతభాగం మీాద వాళ్ళకివ్వాలి. తను ప్రస్తుతం పనిచేస్తున్న సీట్‌లో లంచాలు తీసుకోడానికి చాలా అవకాశాలున్నాయి. పన్నెండేళ్ళు అనుభవమున్న గ్రాడ్యుయేటే కదా అని దొరగారు తనకి మంచి సీటే యిచ్చేరు. ఇన్నాళ్ళూ ఇటువంటి అవకాశాన్ని సద్విని

యోగం చేసుకోలేకపోయినందుకు విచారించేడు గోపాలం. కాబట్టి ఒకవేపు అధికారిని మంచిచేసుకుంటూ, యింకోవేపు లంచాలు పుచ్చుకుంటూ, అందులో కొంతభాగం అధికారికిస్తూ ప్రమోషన్ సంపాదించి, అప్పుడు యింకా ఎక్కువ లంచాలు సంపాదించి అలా మెల్లిగా అంతా నిర్మించుకురావాలి! భేష్! ప్లాను మహా చక్కగా కుదిరింది అనుకున్నాడు గోపాలం. గౌతమబుద్ధుడికి జ్ఞానోదయం కలిగినట్లు గోపాలానికి యీ మహోపథకం స్ఫురించింది. ఉత్సాహంతో కుర్చీదిగి అరుగుమీంచి రోడ్డుమీదకి ఒక దూకు దూకి వీధిలోంచి నడిచి వెళ్లేడు.

ఇప్పుడు కోర్టుకు సెలవలు కాబట్టి మునసబుగారు ఇంటి దగ్గరే వుంటారు. మునసబుగారు చాల మంచివారు. ఇన్నాళ్ళూ ఆయనతో వ్యక్తిగతంగా సంబంధం పెట్టుకోకపోవడం పెద్ద పొరపాటు. మంచికేనా చెడ్డకేనా ఆయన దన్నుండాలి. అయితే యిన్నాళ్లకి మొదటిసారిగా వారింటికి వెళుతున్నప్పుడు వొట్టి చేతులతో వెళ్లకూడదు. ఒక డజను మామిడిపళ్లు కొని పట్టుకెళితే బావుంటుంది. బహుశా తను వెళ్లేసరికి ఆయన స్నానంచేస్తూనో, భోజనంచేస్తూనో వుంటారు. అప్పుడీ పళ్లు మునసబుగారి కుమార్తె రమణమ్మ చేతికే ఇచ్చివచ్చును. రమణమ్మ చాల అందమైంది. ఇంటరు చదువుతోంది. ముందు ముందు తను రమణమ్మతో చనువుగా మాట్లాడాలి. వాళ్ళింట్లోవాడిలాగే చనువుగా తిరగాలి.. వాళ్ళకి చిన్న చిన్న పనులు చేసిపెట్టాలి. ఇవన్నీ తను కట్టబోయే సౌధానికి సోపానాలు. కొంపతీసి చనువుకొద్దీ రమణమ్మ తన్ను ప్రేమిస్తే!

వివాహం చేసుకోమంటే! ఒక భార్య వుండగా మళ్ళీ ఎలా చేసుకోగలడు? తన భార్య చనిపోతే బాగుండు ననిపించింది గోపాలానికి. ఛీ! భార్యచావు కోరడ మేమిటి? అందులోకీ సావిత్రిని సుఖపెట్టడానికే కదా యీ అవస్థ అంతాను. ఇంతకీ రవణమ్మ కర్మం కాలి తన్నెందుకు వరిస్తుంది? అసలా సమస్య రానేరాదు. ఇంతకీ ఏది ఎలా జరుగుతుందో ఎవరు చెప్పగలరు? ఈ ఆలోచనలతో గోపాలంబుర్ర కాకెక్కిపోయింది.

ప్రక్కనే వున్న మంగలిషాపులోకి వెళ్ళి గెడ్డాం గీయించుకుని, మొహం కడుక్కొని తల దువ్వుకుని అద్దంలోచూసుకున్నాడు గోపాలం. తలమీద ఒకటి రెండు వెంట్రుకలు నెరిసేయి. కాని యవ్వనం సడలిపోలేదు.

పళ్ళదుకాణందగ్గర ఒకడజను మామిడిపళ్ళు కొని సరాసరి మునసబుగారింటికి వెళ్లేడు గోపాలం. వీధిగుమ్మంలో నిలుచున్నాడు. లోపలినుండి రవణమ్మ వచ్చి "ఎవరు?" అంది.

"మునసబుగారు లేరాఅండీ?"

"పూజలో వున్నారు. అలా కూర్చోండి" అని వెళ్ళిపోయింది. రవణమ్మకు యీ పళ్లు ఎలా యివ్వడమో గోపాలానికి బోధపడలేదు. మళ్ళీ పిలిస్తే బాగుండదు! అసలేమని పిలవాలి?

ఇంతలో లోపలినుండి బంట్రోతు వీరయ్య వచ్చాడు. గోపాలానికి చక్కటి ఆలోచన తట్టింది. "చూడు వీరయ్యా, యీ మామిడిపళ్లు తీసికెళ్ళి ఇంట్లో అమ్మగారి కిచ్చేసిరా" అని సంచీ అందించేడు వీరయ్యకి. తన చిక్కుసమస్య ఒక్కక్షణంలో పరిష్కారమైంది.

మరో అయిదు నిముషాలకి రవణమ్మ వీధిలోకివచ్చింది. రవణమ్మ నిజంగా చాల అందమైంది. రొమ్ములమీద బరువుగా, నల్లగా తాచుపాములా జారుతున్న జడకు రిబ్బను ముడి వేసుకుంటోంది. తల వొంచుకున్నప్పుడు తెల్లటి మెడమీద నీలిరక్తనాళాలు అందంగా కనిపిస్తున్నాయి. గోపాలం గాభరాగా లేచి నిలుచున్నాడు. మామిడిపళ్ళు యీామె చేతికందించే భాగ్యం తనకు దక్కనందుకు విచారించేడు.

అతని గాభరా రవణమ్మ కనిపెట్టింది. "కూచోండి. నాన్నగారి పూజ అయింది. వస్తారు. గోపాలంగారంటే మీారేనా?" అంది నవ్వుతూ.

"అవునండి"

"మామిడిపళ్ళు చాల బాగున్నాయి. ఎక్కడివి? కొన్నారా?"

ఏమని జవాబివ్వాలో గోపాలానికి తోచలేదు. ఇటువంటి ప్రశ్న వస్తుందనిగాని, వస్తే ఎలా జవాబివ్వాలనిగాని ఇంతకు మునుపు ఆలోచించుకొని రాలేదు. కొన్నానని చెప్తే లంచమిస్తున్నా డనుకుంటుంది. లేకపోతే ఎలా వచ్చాయంటుంది. ఏమిటి దారి? హఠాత్తుగా ఒక ఆలోచన తట్టింది.

"అబ్బే లేదండీ, మా తోటలో కాసినవి. ఈ రకం సువర్ణరేఖలు అసలు బజారులో కనబడవండీ!" అన్నాడు. తన సమయస్ఫూర్తికి సంతోషించేడు.

అంతట్లో మునసబుగారు లోపలినుండి వచ్చారు. గోపాలం లేచి నిలబడి వినయంగా నమస్కారం చేశాడు. మున

సబుగారు చొక్కా తొడుక్కుంటూ, "ఏమిటోయ్—గోపాలం! ఏమిటి విశేషం ?" అని ప్రశ్నించేరు.

"అబ్బే, ఏమీ లేదండీ, ఓసారి తమ దర్శనంచేసుకు వెళదామని వచ్చాను" అన్నాడు గోపాలం.

"నాన్నా, గోపాలంగారు వాళ్ల తోటలో కాసిన మామిడిపళ్ళు తెచ్చి ఇచ్చేరు. చాల బావున్నాయి" అంది రవణమ్మ.

"అలాగటోయ్, చెప్పేవు కావు. ఏమాత్రం తోటుంది! పెద్దదేనా ?"

"అబ్బే లేదండీ, ఏదో మా నాన్నగారు వేయించారు" అన్నాడు తడబడుతూ గోపాలం. తోట పరిమాణం ఎలా చెప్పాలో తెలియలేదు.

"ఏదో బాగానే వుంది. తోటా దొడ్డీ యీ రోజుల్లో సంపాదించడమంటే బహుకష్టం" అన్నారు మునసబుగారు.

గోపాలం వుక్కిరిబిక్కిరైనాడు. అసలు వ్యవహారం ఇలా తిరుగుతుందని అనుకోలేదు. మునసబుగారితో తను డబ్బున్నవాడని చెప్పుకోవాలో, ఎలా చెప్పకుంటే తన భావి కార్యక్రమానికి మంచిదో ముందుగా ఆలోచించుకుని రాలేదు. ఏదైనప్పటికీ ఆయనముందు తనీవిధంగా అబద్ధ మాడడం తన కిష్టంలేదు. అసలు వ్యవహారమంతా గందర గోళమైంది. ఛీ! దీనంతటికీ రవణమ్మే కారణం. తనపాలిట బాగా దాపరించింది శనిలాగ! అనుకుని మునసబుగారి దగ్గర సెలవుతీసుకొని వెళ్లిపోయాడు గోపాలం.

మర్నాటినుంచీ గోపాలం లంచాలు పుచ్చుకోవడం ప్రారంభించేడు. మొదట్లో కష్టంగావున్నా తరవాత క్రమముగా అలవాటైంది. మనుషుల తరహాలనుబట్టీ, కేసులనుబట్టీ ఎలా మాట్లాడాలో, లౌక్యం, నటన, కపటం, మోసం అన్నీ చక్కగా అలవరుచుకున్నాడు. కాని ఇవన్నీ అతనికి సమంగా వొంటబట్టలేదు. లౌక్యం లౌక్యంగానూ, నటన నటనగానూ బయటపడేవి.

ఇప్పుడు గోపాలానికి స్నేహితులు ఎక్కువయారు. వారందరూ గోపాలాన్ని స్తుతించడం ప్రారంభించేరు. ఊళ్లో ఎవరింట్లో ఏ శుభకార్యం జరిగినా అతనికి ఆహ్వాన మొచ్చేది. గోపాలం ఘనత బంధుకోటిలోకూడా వ్యాపించింది. బావమరుదులు, తోడల్లుళ్ళూ తరుచు వస్తూ పోతున్నారు.

ఊళ్లో ఎప్పుడేనా గోపాలంవిషయమొస్తే "గోపాలం చేసిన్కైనా సమర్థుడు. అంచేతే భగవంతుడు అతనికి ఐశ్వర్యం, ధర్మచింత, ఉత్తమగుణాలు అన్నీ ప్రసాదించేడు" అనేవారు పెద్దలు. సంఘంలో తన హోదా, తన ప్రయోజకత్వం ఎంతలో పెరిగిందో సులువుగా గ్రహించేడు గోపాలం. కాని అతని కిదేం నచ్చలేదు. ఇప్పుడు బంధువులు, స్నేహితులూ మాటాడేమాటల్లో పెద్దమార్పు కనిపించింది. "ఫలానా భూమి చవగ్గా అమ్మేస్తున్నారు కొంటారా" అని ప్రశ్నిస్తాడు ఒకడు. "ఈ అద్దెఇంట్లో ఎన్నాళ్ళుంటారు, ఒక చిన్నకొంప నిలేసుకుంటే మంచిద"ని యింకొకరు సలహాయిస్తారు. "మా సంఘానికి విరాళ మివ్వండి" అని యింకొకరు అర్థిస్తారు. "మీ కేమండీ, అదృష్టవంతులు, బి. ఎ. పాసయేరు, చదువు

కున్న చదువు వొట్టినే పోతుందా? అంచేతే యీనాడు నాలు గురాళ్లు సంపాదిస్తున్నారు" అని ఒకరిద్దరు తనముందే అన్నారు. అప్పుడు గోపాలానికి చాల చిరాకేసేది. "బోలెడు డబ్బుపోసి, శ్రమపడి బి. ఏ. చదవడం చాల పొరపాటు చేశాను. నా బి. ఏ. వల్ల నాలుగురాళ్లు సంపాదించడం లేదు. నా సంపాదనవల్ల నాకూ, నా బి. ఏ. కీ గౌరవ మొచ్చింది" అని జవాబు చెబుదామనుకున్నాడు. లంచాలు పుచ్చుకునేవాడికి విలువలు ఆపాదించే యీ అనాగరికులను చూసి గోపాలం అసహ్యించుకునేవాడు. కాని ఏమీ మాట్లాడకుండా వచ్చేసేవాడు.

ఇప్పుడు సావిత్రిలోకూడా గొప్పమార్పు గమనించేడు. సావిత్రిలో యిప్పుడు చిరాకు, కోపం మాయమయినాయి. పిల్లల్ని కొట్టదు. తను రోజూ చక్కగా అలంకరించుకుని, పిల్లలని బాగా సంరక్షణచేస్తుంది. తనతో నెమ్మదిగా భయ భక్తులతో, ప్రేమతో మాట్లాడుతుంది. ప్రతి విషయం లోనూ తన సలహా తీసుకుంటుంది. తన అనుమతిలేనిదే ఏ పనీ చెయ్యదు. ఇంతకుముందులా అక్కయ్య దగ్గరికీ, అన్నగారి దగ్గరికీ వెళిపోతానని బెదరించదు, తన అనుమతి కోరుతుంది. తను మాటాడితే ఎదురుచెప్పదు. తనపట్ల ఆమెకున్న అనురాగం విషయంలో తన కెప్పుడూ, ఎటువంటి సంశయమూ లేదు, కాని ఆమెకూడా అందరి భార్య ల్లాంటిదే. పాపం, అమాయకురాలు అనుకున్నాడు గోపాలం.

సావిత్రి తన్ను సంతోషపెట్టడానికి ప్రయత్నిస్తూంది. ఆమె మళ్ళీ తన వీణ బయటికి తీసింది. సావిత్రికి సంగీతం బాగా

వచ్చును. వీణ వాయించగలదు. పాడగలదు. శ్రావ్యమైన కంఠం. పెళ్ళయిన తొలిరోజుల్లో భార్యపాట విని పరవశం చెందేవాడు తను. ఆనాడు సావిత్రిపాట అవ్యక్త మధుర భావాల్లా, పూచిన సంపెంగపువ్వు వాసనలా తరంగాలుగా వచ్చి తన హృదయాన్ని తాకేది. ఆ రోజులు స్వప్నంలా గడిచేయి. ఆనాటి కీనాడు మళ్లీ పాట వింటున్నాడు.

కాని యీ పాట విన్నప్పుడు గోపాలానికి ఆనాటి అను భూతి కలగడంలేదు. మీదుమిక్కిలి అతని మనసు ఎంతో బాధపడేది. ఇదంతా చాలా కృత్రిమంగా కనిపించేది.

ఒకనాడు సాయంత్రం కచేరీనుంచి వచ్చేసరికి సావిత్రి తల దువ్వుకుని, సిగలో గులాబీలు ముడుచుకుని అతని రాకకు ఎదురుచూస్తూంది. గోపాలం కాఫీ తాగి గదిలో కుర్చీమీద కూర్చుని దినపత్రిక చూస్తున్నాడు. సావిత్రి తమలపాకులకు సున్నంరాసి అందించింది.

"ఏమండి, మా అమ్మ ఉత్తరం వ్రాసింది" అంది మెల్లిగా.

"ఊ హూ..."

"వచ్చేవారం మా చెల్లెలి పెళ్ళట"

"మంచిదే"

మనల్ని పిలవడానికి మా తమ్ముడు వస్తాడట. మీ రొక వారం పదిరోజులు సెలవు పెడితే..."

"అబ్బే, లాభంలేదు. ఇప్పుడు కచేరీలో పనెక్కువగా వుంది. సెలవ దొరకదు, ను వ్వెళ్ళు; నేను రాను"

"బావుండండీ, మీరు రాకుండా నేను వెళ్లనుసుమండీ"

గోపాలానికి చిరాకేసింది. ఇంతకుమునుపు తనో కర్తే వాళ్లవాళ్ళింటికి ఎన్నిసార్లు వెళ్ళలేదు? ఇప్పుడు ప్రయోజకుడైన భర్తతో వెళ్ళి నలుగురిచేత మర్యాదలు పొందుదామని ఆశపడుతూంది అనుకున్నాడు గోపాలం.

ఆవేళ అసలు గోపాలంమనసు బాగులేదు. ఒకప్పుడు తనొక బీదస్త్రీదగ్గర లంచం తీసుకున్నాడు. అప్పటికే ఆమె ఇద్దరుపిల్లలతల్లి. భర్త చనిపోయాడు. ఆమెకు తా నేమీ సహాయం చెయ్యలేనని తెలిసికూడా లంచం తీసుకున్నాడు. ఆమెమీద దావావేసిన మార్వాడీవాడు కేసుగెలుచుకుని ఆమెసామానులు జప్తుచేసుకున్నాడు. ఆ స్త్రీ ఇవాళ తనకి రోడ్డుమీద బిచ్చమెత్తుకుంటూ కనబడింది. తన మనసు ఎందుకో చాల బాధపడింది. తను చేస్తున్నపని చాల హేయమయింది, తన్ను క్షమించమని ఆమెను తన మనసులోనే కోరేడు. ఇవాళతో ఏమైనాసరే ఒక దమ్మిడీ లంచం తీసుకో కూడదని నిశ్చయించుకున్నాడు. ఈ కృత్రిమసౌఖ్యమే తన కెంతో బాధ కలిగిస్తూంది.

"మీరు రాకపోతే నేను వెళ్లను" అంది సావిత్రి.

"అయితే ఏమవు. నేనుమాత్రం చస్తే రాను" గోపాలానికి చాల కోపమొచ్చింది. "నా వుద్యోగంపోతే మీ వాళ్ళు నా కేమేనా వుద్యోగమిస్తారా? వాళ్ల కసలు కనికారమేనా కలగదు. ఏడొట్టి చవటవెధవని వెక్కిరించి సంతోషపడతారు" అన్నాడు చిరాకుగా. సావిత్రి మాటాడలేదు.

గోపాలానికి వెంటనే విచారమేసింది. తను అర్థంలేకుండా కోపం తెచ్చుకున్నాడు.

సావిత్రి మాటాడకుండా, బుర్ర వొంచుకుని, చీర కొంగుతో కళ్లనీళ్ళు తుడుచుకుంది. ప్రయోజకుడైన భర్త ముందు భార్య అంతకన్న చెయ్యగలిగినదేముంది? ఏం, తన కోపం అర్థంలేనిదని చెప్పకూడదూ? అసలు పెళ్లామనేది మొగుడికింతలా లోకువయిపోవడం గోపాలానికి నచ్చలేదు.

కాని సావిత్రికి కళ్లనీళ్లు చూసేసరికి అతనిమనసు కరిగింది. "ఎంత అమాయకురాలివే. ప్రతి చిన్న విషయానికీ యిలా అయితే ఎలా చెప్పు? నాకు సెలవు దొరకదు. నువ్వు మీ తమ్ముడితో వెళ్ళు. సెలవు దొరికితే నేనూ వస్తాను" అని మెల్లిగా నచ్చచెప్పేడు.

సావిత్రికి ధైర్యమొచ్చింది. పెళ్ళిలో చదివించడానికి చీర, పంచలచాపు కొనాలంది.

"సరే, నువ్వు బజారుకెళ్లి కొనుక్కురా, నాకు తీరిక లేదు" అన్నాడు గోపాలం.

"మీరొచ్చి మంచివి ఎంచండి"

"నాకు చీరలగొడవ ఏమీ తెలీదు"

"బావుందండీ, తెలియకపోవడమేమిటి?" అంది సావిత్రి.

గోపాలానికి ఆశ్చర్యమేసింది. ఈ లోకంలో డబ్బు సంపాదించగలిగినవాడు సర్వజ్ఞుడని, వాడికి తెలియని విషయమంటూ వుండదని కాబోలు ఆమెవుద్దేశం. అయినా, ఆమె వెళ్ళి కొనుక్కోకూడదూ? భార్య భర్తమీద యింతగా ఆధారపడడంలో అర్థం లేదనిపించింది గోపాలానికి.

చీరవిషయమై గోపాలం పాతికరూపాయలు మంజూరు చేశాడు. సావిత్రి అతి అయిష్టంగా వొప్పుకుంది. ప్రస్తుతానికి ఆమె, పిల్లలు వెళ్ళడానికి నిర్ణయమైంది. కాని ఎలాగైనా సెలవుకోసం ప్రయత్నించమని సావిత్రి మరీ మరీ చెప్పింది.

గోపాలం ఆలోచనలోపడ్డాడు. లంచగొండితనం తనకు ప్రసాదించిన హోదా, ప్రయోజకత్వాలను చూస్తే తనకే అసహ్యమేస్తూంది. జ్ఞానం, మానవత్వం అనేవి డబ్బుకంటె విలువైనవనీ, అవే జీవితానికి ఆనందాన్నీ, పూర్ణత్వాన్నీ చేకూర్చగలవనీ తన మనసు హెచ్చరిస్తూంది. సంఘం కొలిచే కొలబద్దలతో తన ప్రయోజకత్వాన్ని కొలవడం తన విద్యకీ, విజ్ఞానానికీ ఎంతో అవమానకరంగా స్ఫురించింది. తనకీ గౌరవం అక్కరలేదు. తనలో వచ్చిన బ్రహ్మాండమైన మార్పును గమనించి ఆశ్చర్యపోయాడు గోపాలం. ఇకమీదట ఒక దమ్మిడీకూడా లంచం పుచ్చుకోకూడదని నిశ్చయించుకున్నాడు.

రెండురోజులు గడిచేయి. ఈ రెండురోజుల్లోనూ గోపాలము ఒక కానీ లంచం వుచ్చుకోలేదు. ఈ సంగతి అప్పుడే కచేరీ అంతా వ్యాపించింది. అందరూ తలోకరీతి వ్యాఖ్యానించేరు. మూడోనాడు గోపాలం ఆఫీసుకు వెళ్ళేక, మునసబుగారు పిలిస్తే ఆయనగదిలోకి వెళ్ళేడు.

మునసబుగారు ఏదో వ్రాసుకుంటూ తలెత్తి కూర్చోమన్నట్లు సంజ్ఞ చేశారు. కాని గోపాలం కూర్చోలేదు.

"రామకోటయ్యకు చార్జీ అప్పగించు. నీమీద పైనుండి పెద్దచార్జిషీటు వచ్చింది. కచేరీ కాగితాల్లో నువ్వు చెయ్యి

రాని తప్పులు చేశావు. కొన్ని కాగితాలమీద తేదీలుకూడా మార్చబడివున్నాయి. నీమీద ఎంక్వాయిరీ జరిగి కేసు ఏదో తేలేవరకూ నిన్ను ప్రస్తుతం సస్పెండు చెయ్యవలసివచ్చింది.'' అన్నారు మునసబుగారు గుక్కతిప్పుకోకుండా.

గోపాలం నిలువునా కృంగిపోయాడు. ఏం చెయ్యాలో తెలియక అలాగే నిలుచున్నాడు. మునసబుగారు మళ్ళీ తలెత్తి, ''నీ సంగతి నాకు బాగా అర్థమయింది. సరే, ముందు ఆ చార్జిషీటుకు సంజాయిషీ వ్రాసి దాఖలుచెయ్యి, తరవాత ఆలోచిద్దాం''అన్నారు. మునసబుగారు నిజంగా సహృదయులు.

గోపాలం మాట్లాడకుండావచ్చి రామకోటయ్యకు చార్జి అప్పగించేడు. పాపం పిల్లలుగలవాడు అని తక్కిన గుమాస్తాలు సానుభూతి చూపించేరు. హెడ్ గుమాస్తామాత్రం వెకిలినవ్వు నవ్వేడు. ''లంచాలు పుచ్చుకోగానే సరా? అబ్బో, దాని కెంత సమర్థత కావాలి !'' అన్నాడు అనుభవజ్ఞుడైన హెడ్ గుమాస్తా. లంచాలు పుచ్చుకోవడంవల్ల ఉద్యోగం పోవడంలో వున్న చిన్నతనంకంటె, లంచాలు పుచ్చుకోవడంలో అసమర్థుడుకావడం ఎక్కువ చిన్నతనముందని కాబోలు అతని అభిప్రాయం. గోపాలానికి హెడ్ గుమాస్తానుచూస్తే వొళ్లు మండింది. కాని మాటాడకుండా చార్జిషీటు పుచ్చుకుని ఇంటికి వచ్చేశాడు.

సరాసరి గదిలోకివెళ్లి మంచంమీద పడుకున్నాడు. సావిత్రి తన చెల్లెలు పెళ్ళికి వెళ్ళడానికి సన్నాహమైవచ్చింది

"ఏమండీ సెలవు దొరకలేదా ?" అన్నది మెల్లిగా. గోపాలం మంచంమీద లేచి కూర్చున్నాడు. "సావిత్రీ, ఇవాళ నా వుద్యోగం పోయింది. మళ్ళీ ఏదేనా దొరికేవరకూ అంతా సెలవే, పద నేనుకూడా వస్తాను మీవాళ్ళింటికి" అన్నాడు.

సావిత్రి మొదట్లో నమ్మలేకపోయింది. కాని గోపాలం మళ్ళీ చెప్పేడు. ఆమెకు నోటమాట రాలేదు. ఎవరో తలమీద కర్రతో కొట్టినట్లనిపించింది. డబ్బులేక బాధపడిన కష్టదినాలు మళ్ళీ జ్ఞాపకమొచ్చేయి. భగవంతుడు తనకీ, తన పిల్లలకీ యీ శిక్ష ఎందుకు విధిస్తున్నాడో ఆమెకు అర్థం కాలేదు. తలగడలో మొహంపెట్టి చేతులతో కప్పుకుంది. "లే, విచారించకు వెధవ వుద్యోగం పోతె మరొకటి దొరకుతుంది. పద సామాను కట్టు, నేనూ వస్తాను వెళదాం" అన్నాడు గోపాలం.

"నేను వెళ్లను, నాకొద్దు"అని వెక్కి వెక్కి ఏడిచింది సావిత్రి. ఆమె ఎందుకు వెళ్లనంటూందో గోపాలానికి అర్థమయింది. సావిత్రిమీద అతనికి జాలికలిగింది.

—o—

# కరువు కాలం

అప్పడు చిన్నప్పటినుంచి ఒక రెండెడ్లబండి పెట్టుకొని, సంతలకి తోలి, అక్కడ మిరపకాయలు, ఉల్లిపాయలు, ఎండుచేపలు తెస్తే, భార్య నరిసి వీధిలో బండరాయిమీద దుకాణం పెట్టి అమ్మేది. వాళ్ళిద్దరూ గంజినీళ్ళుతాగి ఒక మడిచెక్క ఆర్జించారు. కూతురికి పట్నపు సంబంధంచేశారు. కొడుకు నారాయుడు ఎదగగానే, పొలంమీద మూడువందలు అప్పుచేసి, జట్కాబండి కొన్నాడు. అప్పడు ఇప్పుడు బాగా ముసిలాడయేడు. ఇప్పుడు బండీ ఎడ్లు లేవు. మడిచెక్క మాత్రం మిగిలింది.

అప్పడు ఇంటికొచ్చి వీధిలో పొగాకు నముల్తూ కూర్చున్నాడు. చీకటిపడుతూంది. నారాయుడు పొద్దున జట్కాబండి పట్నం తోలుకెళ్ళి ఇంకా రాలేదు. నరిసి పొయ్యిలో నిప్పేసి బయటికొచ్చింది.

“ఏటే, ఈడేటింకా పికరేలేదు. పెందలకడ సల్దిగంజి తాగిపోనాడు. దీపాలెట్టే ఏలయింది.

వాడు ఇంటికి రాకపోతే అప్పడికి బెంగ, చీకాకున్ను.

“ఏటో బేరం తగిలిందిగావోసు” అంటూ నరిసి, బురదయిన కాళ్ళ కడియాలు చీరెకొంగుతో తుడిచింది.

“ఏటో ఎదవకుంక. సిన్నతనంగాదు, సితకతనంగాదు” చిరాగ్గా అన్నాడు.

“అడి నెందుకేటి తిడతావు? అ ఏటిసేసినాడు?

"అదుగో నీనుంచే ఆ ఛొట్టి పోకిరీ అయిపోయినాడు. ఇంక ఆడు నన్నాదుకోనేదేటి?"

"నేక నేక ఒక్కడు పుట్టినాడీ కడుపుకి—"

"సాలూరుకోయే. నీ దొట్టి మూరకత్వం—"

"పోనీ, సిరిపరపాళ్ళ బొట్టి నిస్తామన్నారుగదా—ముడెట్టేరాదా?"

"అదే సూసినాను—తులం బంగార మెడతారట. రెండు తులాలెట్టమన్నాను. ఏదో సూసి ముడెట్టి పొమ్మంటాను ఎదవని—"

"బాగుందినేరా—సత్తిగాలపోడాడు—"

"ఓ పోస్, నీకే ఎరికే? ఆ డేసాలూ-ఆటా—ఆడి సెరాయి, సొక్కా, వోసన్నూని! పెందలకా డెలతాడు. మాపిటి కొస్తాడు. మూడు రూపాయలు దొరికాయంటాడు. అరరూపాయి తాగేస్తాడు. పావలా కబ్బులో తినేస్తాడు. అటా బీడీలు కాలిసేస్తాడు. ఈడి బతుక్కి బీడీలు, కబ్బులు, వోసన నూనెలు! ఇంటికి రెండు రూపాయలిస్తే - గడ్డికే, ఉలవలకే అవుతాంది రూపాయిన్నర. దీని సిగ తరగా-పావలా ఉలవలు ముప్పావలా అయినాయి! ఏం పిరుం! ఇంక పొయ్యిమీదకి గింజ లేటి తేవాల? ఆ అప్పెలా తీరుతాది? రానీ, సెబుతాను. సెప్పినమాట ఇన్నాడా సరే, నేదా పెళ్లి సేసేసి, ఏరుపోయి వండుకోమంటాను. పోనీ, నాకు కొడుకు పుట్టే నేదనుకుంటాను—"

ఆ రోజు అప్పడి చిరాకుకి కారణం ఇంట్లో బియ్యాం లేవు. ఊళ్లో ఎక్కడా దొరకవు. సన్నాసినాయుడు పెళ్ళాం

మాత్రం రూపాయికి శేరుచొప్పున అమ్ముతోంది. నారాయు డొస్తే పోనీ, అలాగే తెద్దా మనుకున్నాడు. వాడూ లేడు, డబ్బూ లేదు.

బాగా చీకటిపడింది. నారాయుడు 'గరగరమె దివాలీ' అని పాడుకుంటూ జట్కా నిలబెట్టాడు. గుర్రా న్నిప్పి సాలలో కట్టేసి ఊగుతూ, జోగుతూ లోపలికొచ్చి వంట పొయ్యిదగ్గర కూర్చున్నాడు.

"బేగి కూ డెట్టే—" ఎర్రగా చింతనిప్పుల్లా ఉన్న కళ్లు మూతలుపడుతున్నాయి.

"గింజ లేవీ?" నరిసి అప్పడికి వినబడకుండా అంది. కాని అప్పడివి పాముచెవులు.

"ఓ రబ్బోయ్. నువ్వు గడింసేసిన డబ్బుకి కూడొకటి! సిగ్గునేని నమిడీకొడకా, ఎల్లినావురా ఈ ఏల దాకా—"

"ఓసనుకి జేరం తోలినాను"-నారాయుడు ఇంట్లో పిల్లి, బయట కోతి.

"ఏటి దొరికిం దీ పొద్దు?"

"రెండు"

"పొద్దంతా తోలినావు"

"న న్నేటి సెయ్యమంటావు? అంతే, పొద్దంతా తోలితే లచ్చరూపాయ లొస్తాయేటి? కోసుడుదూరం ఎత్తే అద్దరూపా యిస్తారు. ఇయాల ఎండంతసేపూ పరిగెట్టింది గొడ్డు. అయితే మాత్రం ఏటి నాబం.

"ఓరె! ఎంత పనికిమాలినోడి వయినావురా" నిస్పృహగా కూర్చున్నాడు.

"నా నేటి సేసినానెస్"

"తేరా ఆ రెండూను. రూపాయి ఉలవలు, రూపాయి గింజలు తెత్తాను" అన్నాది నరిసి.

నారాయుడు జేబులోని రూపాయితీసి ఖంగునపడేశాడు.

"ఓ రూపాయి కరుసయిపోనాది—"

"రూపాయి కరుసే! ఓలమ్మ రూపాయి తాగేసినాడే" నరిసి ముక్కుమీద వేలేసుకుంది.

"ఏరా, రూపా యేటి సేసినావు?"అప్పడు గద్దించాడు.

"కరుసయిపోనాది. అద్దరూపాయి తాగినాను; అద్దరూపాయి మద్దినాళ్ల చినిమా కెల్లేను"

"ఓలమ్మా, ఎంత పోకిరయిపోనాడు" నరిసి నెత్తీ నోరూ కొట్టుకుంది. కళ్ళంట నీళ్లు రాకపోయినా నరిసి ప్రతి దానికీ ఒట్టి కొట్టినే ఏడుస్తుంది.

"పోనీ. కడుపుకి తాగినాడంటే నే నేటంటాను? ఎదన కుంక కీ ఏసా లేటి?"—అప్పన్న కోపంగా పెదవికరిచాడు. అప్పడి దృష్టిలో తాగడం అవసరం; గొప్పకూడాను. కాఫీ క్లబ్బులు, బీడీలు, సినీమాలుమాత్రం విలాసాలు.

"పోరా నాయింటోంచి పోయి ఏరే బొడుకో. నువ్వేటి నాకు గంజినీళ్లోసేదేటి? నాకు కొడుకే నేడనుకుంటాను. పో—సీ! సిగ్గులేని జలమ ఎత్తగానే సరా?"

"ఒరే, రూపాయిచ్చినావు, గుర్రాని కేటెట్టడం, గింజ లేటి తేవడం సెప్పు" చేతిలో రూపాయి పట్టుకొని ఆలోచిస్తూంది నరిసి. సాలలో అస్థిపంజరంలావున్న గుబ్బిం ఆకలితో సకిలించింది.

నారాయుడు మెల్లిగా లేచి నుక్కమంచంమీద కుక్క-లాగా ముడుచుకొని పడుకున్నాడు.

"ఈ డేటో గట్టెక్కిస్తాడని బెమపడ్డాను - ఏటో నా కరమం !" అనుకుంటూ, వీధిలో అడుగులచప్పుడయితే చూదామని వెళ్ళేడు అప్పడు.

"ఎవడ్రోరయ్యా అవల ?"

"నేనురా, సినోన్నిడిని"

"ఏటిరోయ్, బావమరిది ! ఎటునుంచేటి—?"

"నకిడాం ఎల్లేను; ఇలా సూసిపోదామని..."

"ఒసేయ్, మీ సినోన్న డొచ్చినాడే"

కోర మీసాలు, తలపాగా, ఎర్రబనీను, గోచీ, చేతిలో మువ్వలకర్ర, కిర్రు జోడూ తయారయాడు అప్పడి బావమరది చినోన్నడు. వాడి నందరూ పలకరించారు. కాని అందరికీ చింతగానే వుంది ఇంట్లో బియ్యం లేవని.

"కూకోరా. ఇం కెప్పు డేటెల్తావు? కూడుతిని తొంగుని కోడికూసేజాముని లేసి ఎల్దుగాని—" అప్పడు ఇంట్లో బియ్యం లేకపోయినా చుట్టాన్ని ఉండమని, బావమరిది దగ్గర తన దర్జా చూపించాడు. బావమరిది కాళ్ళు కడుక్కొని గోడకి జారపడి చుట్ట వెలిగించాడు.

నరిసిగుండెల్లో రాయిపడింది. వీధిలో చుట్టం—ఇంట్లో బియ్యంలేవు—చేతిలోఉన్నది రూపాయి—ఇం కెక్కడా అప్పు దొరకదు. అప్పడిని సైగచేసి పిలిచింది.

"గింజలు నేవు—"

"ఆ రూపాయెట్టి తే—"

"గుఱ్ఱానికి ఉలవలో—?"

"మరేటి సేస్తం—గడ్డి పడే—" సాలలో గుఱ్ఱం ఆకలితో సకిలించింది.

నరిసి పెరట్లోంచి వెళ్ళి సన్నాసినాయుడు పెళ్ళాం దగ్గర నుంచి రూపాయి బియ్యం తెచ్చి వండింది. సేరుబియ్యం ముగ్గురికి సరిపోయాయి. పొద్దుటి అంబలి మిగులుంటే తాగి పడుకుంది నరిసి.

అప్పుడూ, బావమరదీ వీధిలో పడుకుని చుట్టలు కాలుస్తున్నారు. ఆ గాఢ చీకట్లో ఆ చుట్టలు నిప్పుకణాల్లా వెలుగుతున్నాయి.

"మీ ఊళ్ళో కరువెలాగుందేస్" అన్నాడు బావమరిది.

"గోరమేన్రా! పెపంచం బగ్గున మండిపోతంది-రూపాయికి శేరు—"

"ఈ వూర్లో మోతుబర్లే నేరు. మీకు మరీ సికాకు—"

"ఏదో బగమంతుడి దయవల్ల మా కంత నేదులే—" అప్పుడు దర్జాగా అని తుప్పున ఉమ్మి, అటునుంచిటు వొత్తిగిల్లి నిశ్చింతగా పడుకున్నాడు.

ఎదురుగుండా చీకటిలో మర్రిచెట్టుమీద గుడ్లగూబ కూసింది.

సాలలో అస్థిపంజరంలా ఉన్న గుఱ్ఱం ఆకలిగా సకిలించింది.

రచనాకాలం: అక్టోబరు 1947.

—o—

# బియ్యపు గింజలు

నిశ్చింతగా చీకట్లను దూసుకుపోతూంది రైలుబండీ. వేసవికాలపు రాత్రుళ్లు. విపరీతంగా ఉక్కపోస్తూంది. రాయిపూరునుండి వాల్తేరు మూడవక్లాసులో ప్రయాణం చేస్తున్నాను. నిజం చెబుతున్నాను, మూడవక్లాసులోనే ప్రయాణం చేస్తున్నాను. కర్మంచాలక టిక్కెట్టు దొరక్కో, లేకపోతే జాగాలేకో, ఎవడేనా రెండో క్లాసులోగాని ప్రయాణం చేశాడా—యింటికొచ్చి మాటలసందర్భంలో ఏదో విధంగా నలుగురికీ చెప్పేస్తాడు తను సెకండ్ క్లాసులో ప్రయాణం చేసినట్టు. కాని మూడవతరగతిలో ప్రయాణంచేస్తే మట్టుకు ఆ వూసే ఎత్తడు. ఎవరేనా అడిగితే, అవసరమైతే ఇంటరువరకే అబద్ధమాడుతాడు. సరేలెండి, ఆ విషయమిప్పు డెందుకు రామాయణంలో పిడకల వేటలాగ!

నే ప్రయాణం చేసిన మూడవతరగతిపెట్టిలో ఎక్కువ జనం లేరు; నలుగురం వున్నాము. నా పక్క బెంచీమీద పడుకున్న తెలుగాయనకు రైల్వేలో పని, గుమాస్తా అనుకుంటాను. లేకపోతే మూడవతరగతి కర్మమేం? కాని కొసవరకూ డాబుసరిగానే మాట్లాడేడు. ఇంగ్లీషులోనే ప్రారంభించి తన నాగరికతను కాపాడుకున్నాడు.

"ఎక్కడి కెళుతున్నారు?" అని ప్రశ్నించి మర్యాదగా ఒక సిగరెట్టు అందించాడు.

"వాల్తేరు-మీరు?"

"నేనూ అక్కడికే, ఎక్కడినుండి వస్తున్నారు?"

"ఢిల్లీ నుండి"

"ఓహో, అలాగా! ఏమిటి ఢిల్లీలో ఏం చేస్తున్నారు?"

"ఏదో ఉద్యోగం, కూటికోసం"

"అంతే అనుకోండి. అయినా ఢిల్లీలో వున్నారు, అదృష్టవంతులు" అన్నా డాయన. ఆ అదృష్ట మేమిటో బోధపడ లేదు. ఉన్నవాళ్లందరూ కూడా అదృష్టవంతు లేనా అనే సమస్యకూడా వుంది. అయినా మొత్తంమీద నా గౌరవం, ఢిల్లీ గౌరవం నిలబెట్టేను.

"ఏమిటి ఢిల్లీ వింతలు!"

"ఏమున్నాయి. పత్రికల్లోవచ్చేవే !"

"ఆహారసమస్య ఎలా వుందక్కడ?"

"బాగానే వుంది"

"అంటే, పరిస్థితి బాగానే వుందనా మీ వుద్దేశం ?"

"ఆ! అవును. మనపక్క ఎలావుంది?"

"చాలా ఘోరంగా వుందంటున్నారు" అంటూవుంటే స్టేషను వచ్చి బండి ఆగింది. మంచినీళ్ళకని బండి దిగి వెళ్లేడాయన.

ఆహారసమస్య ! దీన్నిగురించి పేపర్లు తెగ వ్రాస్తున్నాయి. నాయకులు, మంత్రులు యీవిషయమై ఉపన్యాసాలిస్తున్నారు. విధీ విరామంలేకుండా సమస్యా పరిష్కార సూచనలు! బీహారులో ఆకలిచావులు! మద్రాసులో కరువు! అమెరికానుండి అన్నదానం! చైనానుండి బియ్యం! ఆహార మంత్రిగారి వనమహోత్సవాలు ! మిస్సేమీల్ ఉద్యమం !

అన్నానికి బదులు తెల్లదుంపలు, మామిడి టెంకల భోజనం! ఇదీ వరస! అసలు కరువంటే ఏమిటి? తిండిలేక మనుషులు చచ్చిపోతారా? ఎలా నమ్మడం? కటికదారిద్ర్యంలో నివసిస్తూన్న ప్రజ లనేకమందున్నారు. కాని వారు ఎలాగో అలాగ ఏ బలుసాకో తిని బతుకుతారుగాని చస్తారా? ఉత్తర ధృవంలో ధాన్యాదులు పండవు! అయితే అక్కడివాళ్ళు తిండికిలేక చచ్చిపోతున్నారా? మనిషికి బతకాలనే ఆశేవుంటే ఎలాగైనా బతికేస్తాడు. పరిస్థితులకు అలవాటుపడి సర్దుకుపోతాడు. ఇంతకుమునుపు కరువులు కాటకాలు ఎన్ని రాలేదు? ఎన్ని పోలేదు?

అంచేత? ఆహార సమస్య అంటే ఏమిటి? దాని సమగ్ర స్వరూపమేమిటి? దాని కింత అట్టహాస మేమిటి? ఈ ధర్మసందేహం నాబుర్రలో ప్రవేశించింది. ఈ రెండు మూడేళ్ళలో నాకీ ప్రశ్న తట్టేలేదు. ఏదో పేపర్లో చదవడంతప్ప దానిని గూర్చి అట్టే ఆలోచించలేదు. ఇంత శోధించలేదు! హోటల్లో డబ్బుపారేసి హాయిగా కడుపునిండా అన్నం తిన్నాను. అప్పుడప్పుడు ఒక పూట భోజనం మానీసేవాడిని; కాని ఆహార సమస్యా పరిష్కారార్థమై మాత్రం కాదు; అజీర్తి వల్లనే. కాబట్టి ఆ గొడవలేదు. ఇప్పుడు పీ డెవడో అనవసరంగా లేవదీసి నా బుర్రంతా పాడుచేశాడు.

నా రైల్వే సోదరుడు ఎప్పుడో నాకు తెలీకుండా ముసుగుతన్ని పడుకున్నాడు. ఆహారసమస్యా చర్చకై అతడ్ని లేపడం మంచిదా, కాదా అని ఆలోచిస్తూంటే ఒక స్టేషనులో బండి ఆగింది. ఒక్కసారి జనం ఎలకలమందలా

లోపల జొరబడ్డారు. బండికి పెంకులు లేవుగాని పెంకులెగిరి పోయేలా మాటలు! పిలుపులు! కేకలు! అబ్బబ్బ! వెధవగోల! దిక్కుమాలిన జాతర! చేపలసంతలా తయారయింది పెట్టె! మా రైల్వే సోదరుడు ముసుగుతీసి "ఏ స్టేషను?" అని అడిగాడు. పక్కనున్న ఆడది "కెసింగా" అని జవాబు చెప్పింది.

"అంటే ?"

"అంటే ఏటి? దానిపేరు కెసింగా" అన్నది ఆడది.

"ఏడిసినట్టుంది" అన్నాడు సోదరుడు. పెట్టెలో జనాన్ని చూసి విసుక్కున్నాడు. "ఈ వెధవలందరినీ ఎందు కెక్కనిచ్చేవ్!" అన్నాడు నాతో, ఎవరూ ఎక్కకుండా చూడ్డానికి నన్ను కాపలా పెట్టినట్టు.

"వాళ్ళు నన్నడిగి ఎక్కేరేమిటి? అంతా ఒకసారి లోపల జొరబడ్డారు"

"వెధవలు, ఇంక మనల్ని నిద్రపోనివ్వరు. మనసామాన్లు ఓ కంటితో కనిపెట్టి వుండండి. ఇందులో చాలమంది దొంగవెధవ లుంటారు" అన్నాడు అనుభజ్ఞుడైన నా తోటి ప్రయాణీకుడు.

"ఎవరు వీళ్లంతా?" అని ప్రశ్నించాను.

"బియ్యం దొంగతనంగాపట్టుకుపోయి మనప్రాంతంలో అమ్మకునేవాళ్ళు" అంటూ మళ్ళీ ముసుగుతన్నేడు సోదరుడు. వాడి సామాన్లు చూడ్డానికి నన్నేలాగా నియోగించాడాయెను.

బండి నడుస్తూంది, కాని అల్లరి పూర్తిగా సద్దుకోలేదు పెట్టె చిన్నది, జనం ఎక్కువ. అందులో అన్నిరకాల వాళ్ళూ, అన్ని వయసులవాళ్ళూ వున్నారు. ఆడ, మొగ, చిన్నా,

పెద్దా, ముసలీ, ముతకా అందరితో పెట్టె కిటకిటలాడుతూంది. అందులో ఆడవాళ్ళూ, పిల్లలూ ఎక్కువ. ఓ అయిదారుగురు కుర్రాళ్ళుకూడా వున్నారు. తలుపులు తీసి, కాళ్ళు బయట పడేసి, నేలకూర్చుని సినిమాపాటలు పాడుతున్నారు. పెంకె వేధనలు! అయితే అక్కడ నా కొకటి ఆశ్చర్యంవేసింది. మధ్యవయస్కులైన ఆడవాళ్లకు కడుపులు ఎత్తుగా వున్నాయి; ముసలమ్మలకు నడుములు ఎత్తుగావున్నాయి. వాళ్లు వంగి గూనివాళ్ళలా నడుస్తున్నారు. మొదట చూడగానే అర్థం కాలేదు. ఆడవాళ్లందరూ గర్భవతులుగా వుంటారా? ముసలమ్మలందరూ గూనివాళ్ళా అని అనుమానం వచ్చింది. కాని తృటిలో నివృత్తి కలిగింది. అవి కడుపులు కావు; గూనులుకావు, బియ్యపు మూటలు! వారా మూటలు తమ శరీరాలకు కట్టుకోవడంవల్ల సులువుగా అటూ ఇటూ కదల లేకపోతున్నారు. దొంగపని చేస్తున్నామనే చైతన్యం భయం బెదురు వాళ్ళ మొహాల్లో, నడకల్లో, కదలికల్లో కనిపిస్తూంది. నీడలా వెంటాడుతూన్న భయం, భయంవల్ల తొట్రుబాటు, ఆయాసం, పట్టుబడకుండా వుండాలనే తీవ్రప్రయత్నం, తప్పుకు పోగలమనే ఆశ, తప్పుకుపోవడంలో తమకుగల అనుభవ చైతన్యం వారిలో ప్రస్ఫుటంగా గోచరిస్తున్నాయి. నలుగురూ నాలుగు మూలలా సర్దుకున్నారు. ఒక ఆడది నా కెదురుగా నేలను కూర్చుంది. కడుపుకు బియ్యంమూట కట్టుకోవడం వలన చంటిపిల్లకు పాలివ్వడానికి కొంచెం అవస్థపడుతూంది.

"ఎక్కడికి వెళుతున్నారు మీరంతా" అని అడిగాను ఆడదాన్ని.

"నలుగురూ నాలుగుచోట్ల దిగిపోతాం బాబయ్యా! రాయిగడావరకు కాపాడండి బాబూ! మీా పున్నెముంటుంది" అన్నాది ఆడది.

"ఇక్కడ బియ్యం చవకా?"

"అవును బాబు, రూపాయికి నాలుగు శేర్లు!"

"ను వెన్ని శేర్లు పట్టుకొస్తున్నావు?"

"ఎన్ని తేగల్ను బాబయ్యా? రెండురూపాయిలబియ్యం కొన్నాను బాబూ!"

"వీటిని ఎన్ని రూపాయిల కమ్ముతావు?"

"లేదు బాబు, అమ్మడానికి కాదు తిండానికి తెచ్చు కుంటాము"

"నిజం చెప్పు ఫరవాలేదు. నేనేం పోలీసువాడినికాదు"

"మేము తినడాని కుంచుకుని మిగిల్నవి అద్దురూపాయి సొప్పున అమ్మేస్తాం" అన్నాది. ఇంకా ఎక్కువ ధరకే అమ్ము తుంది. నిజు చెప్పకుండావుందని సులువుగా గ్రహించేను.

ఆడది తలదించుకుని పిల్లకి పాలిస్తూంది. వయసు నడి వయస్సు. యవ్వనం సడలలేదు. కాయకష్టంచేసిన శరీరం; అందమైన కళ్లు! కాని సంస్కారంలేని జుట్టు, మాసిన, అక్క డక్కడ చిరిగిన బట్ట. అనాగరిక స్వరూపంవల్ల తొలిచూపుకు అందంగా కనపడకపోవచ్చు. ఆడదానివేపు తదేక దీక్షగా చూసేను. ఆమె నిష్కల్మషమైన కళ్ళల్లో, విషరహితమైన చూపుల్లో అజ్ఞానం, అమాయకత్వం, భయం, దైన్యం గోచ రిస్తున్నాయి. ఈమేగాని ఇంతో అంతో చదువుకున్ను; పరి శుభ్రంగా, చక్కగా గోరింకలా తయారయి ఇంటరుక్లాసు

లోనో, రెండో క్లాసులోనో ప్రయాణంచేసివుండును. దీనిలాగ బియ్యం దొంగతనంచేసి, నేలమీద, బెంచికింద దూరి యిన్ని పాట్లు పడుతుందా? ఈ ఆడదానికీ ఆ ఆడదానికీ వ్యత్యాసం అవకాశాల్లోవుంది. దానికి అవకాశా లున్నాయి; దీనికి లేవు. ఇది చాలా అన్యాయం! ఛీ! మళ్ళీ రాజకీయాల్లో పడుతున్నా నేమిటి? వెధవ రాజకీయాలంటే నా కెంత తలనొప్పో, ఆలోచిస్తూ తిరిగి తిరిగి అందులోనే పడుతూవుంటాను. ఆడది తల దించుకుని కూర్చుని, నిద్రపడుతూన్న బిడ్డని జోకొడుతూంది. పాపం, ఆడదానిమీద నాకు సానుభూతి కలిగింది.

"నీ కెంతమంది పిల్లలు?" అని అడిగాను కాని, యీ విషయం నా కనవసర మనిపించింది వెంటనే. ఆడదాని మంచి తనాన్ని అవకాశంగా చేసుకుని ఎక్కువ చనువు తీసుకున్నా నేమో నని విచారించేను. లేకపోతే యింకో పెంకిమనిషైతే "నీ కెందు కా వూసు? నువ్వేం కన్నావా, పెంచేవా వాళ్ళని" అని ఎదురు తిరిగేది. అప్పుడు నా పరువుమర్యాద లేంకాను? ఈ ఆడది మంచిది కాబట్టి "ముగ్గురు బాబూ" అన్నాది.

"నీ భర్త కేం పని?"

"ఏం పని బాబు. ఏం కలకటేరుపనా, తాసీల్దారుపనా? అడగాలేటి? పొలంలో ఏదో కూలీ నాలీ సేత్తాడు"

"అయితే నీకీ బియ్యం వర్తక మెందుకు? నువ్వూకూడా కూలి చేసుకోరాదా?"

"ఎందుకు సెయ్యను బాబు. సెయ్యకొల్లక కూకుంటే గడుస్తాదా? వారానికి రెండు మూడురోజు లిలా వచ్చి బియ్యం మట్టుకుపోతాను. మా తిండి కుంచుకుని తక్కిన వమ్మేస్తాను"

"ఏం మీ ఊళ్లో బియ్యం ఏమీ దొరకవా?"

"మీకు తెలీదేటి బాబూ, సదివినోరు. కరువు బగ్గున మండిపోతూందికదా! బియ్యపుగింజలు దొరుకుతాయి బాబు, దొరక్కపోవు. కాని బ్లాకులో కొనగలమా మాలాంటివోల్లం"

"నువ్వు బ్లేకుమార్కెట్టులో బియ్యం కొనలేవు, కాని అమ్మగలవు. ఏం?" అని ఎత్తిపొడిచేను. మహగట్టిగా కొట్టేను దెబ్బ. దీని కేం జవాబివ్వగలదు? నా తెలివితేటలకి సంతోషించేను.

"మాకాడ బియ్యం లేనప్పుడు యింకోరిదగ్గర బ్లేకులో కొనుక్కోడంనేదా? అలాగే మా కున్నప్పుడు మే మమ్ముకుంటాం, ఆల్లు మాదగ్గ రొట్టుకెల్తారు." గట్టిజవాబే ఇచ్చింది. ఫెడీమని లెంపకాయకొట్టినట్టు జవాబిచ్చింది. ఎవరి కవకాశముంటే వాళ్లు యింకోరిని బాధిస్తేకాని నడవదు జీవితం. సాంఘికధర్మమంతా ఒక్కముక్కలో చెప్పింది ఆడది, నాకు సిగ్గొచ్చేలా.

ఇంతట్లో పెట్టిలో కలవరం బయలుదేరింది. మళ్ళా అక్కడివాళ్లు నాలుగుమూలలా హడావిడిగా సర్దుకుంటున్నారు. కొందరు మరుగుదొడ్లలోకి కొందరు బెంచీలకిందకి దూరేరు. కొందరు పక్కపెట్టెలోకి పరుగెట్టేరు. ఆడది చటుక్కున బెంచీకింద దూరి పక్కలో బిడ్డను పెట్టుకుని పడుకుంది. కాళ్లు రెండూ కుక్కలా ముడుచుకుంది. కడుపుకి బియ్యపుమూట వుండడంవలన ఏమీ సదుపాయంగా లేదని నేను గ్రహించేను. ఈ అల్లరికి మా రైల్వే సోదరుడు లేచి కూర్చున్నాడు.

"ఏమి టీ గొడవ" అన్నాను. నా కేం అర్థంకా లేదు.

"ఎవడో రేషనింగువాడు చెకింగుకి వచ్చాడు కాగోలు బియ్యంమూటలు పట్టుకోడానికి" అన్నాడు సోదరుడు. రేషనింగువాళ్ళు చాలమందని దించేసేరు. రెండు నిముషాలూ పెట్టి మళ్ళీ చేపలబజారయింది. వాళ్లు వెళ్ళేక ఆడది బయటకొచ్చి కూర్చుంది. బెంచీకింద ఉక్క పోస్తోంది; ఎలా పడుకోగలదు ?

"ఆహార సమస్యగురించి మీతో చర్చిద్దా మనుకున్నాను. మీరు పడుకున్నారు" అన్నాను.

"ఎందు కొచ్చినపని చెప్పండి. కావాలంటే యీ పేపరు చదవండి. ఆహారమంత్రిగారి వుపన్యాసం పడింది. ఆయన పరిస్థితిని పూర్తిగా విశదీకరించేరు. నిజమే, కొంత కొరత వుందని ఆయనే ఒప్పుకున్నారు. ఎందులోలేదు కొరత? మన కన్నీ కొరతే" అని పేపరు నా మొహాన్ని పారేశాడు.

"పేపర్లు చదివి, చదివి మొహంమొత్తింది. నన్ను చంపకండి. మరి యీ సమస్యకు పరిష్కార మేమిటి?"

"ఇటువంటి సమస్యా పరిష్కారానికి ప్రజల్లో నైతిక ఆధ్యాత్మికబలం అవసరం. లేకపోతే జరగదు. చూడండి, యీ వెధవలు యీ బియ్యం బ్లాకుమార్కెట్టు చేస్తున్నంత కాలం కరువు పోదు."

"కరువు పోతేగాని బ్లాకుమార్కెటు పోదు. ఎలాగ ? పెళ్ళి కుదిరితేగాని పిచ్చి కుదరదు, పిచ్చి కుదిరితేగాని పెళ్ళి కుదరదు"

"పోనిద్దురూ ఆ గొడవలన్నీ రాజకీయవేత్తలకు గాని మన కెందుకు? పదిగంటలైంది. నేనింకా భోంచెయ్యలేదు.

ఎందుకీ శుష్కవాదం. తియ్యండి ఆ టిఫిన్ కేరియర్. ఇద్దరం తిందాం'' అన్నాడాయన. నేను వద్దన్నా బలవంతం చేశాడు. ఇద్దరం పూరీలు, మిఠాయి తిని కూజాలో మంచి నీళ్లు తాగి, ఫ్లాస్కులో పాలు సేవించి, జిర్రున త్రేన్చాము. సోదరుడు మళ్ళీ ముసుగుతన్నేడు. వీడి నిద్ర మండిపోనూ, కుంభకర్ణుడిలా వున్నాడు!

అంతట్లో పెట్లోకి టిక్కెట్టు కలక్టరొచ్చాడు. వీళ్లని చూసి గట్టిగా నాలుగు కేకలేశాడు. సినిమా పాటలు పాడుతూన్న కుర్రవాళ్ళు వాడితో మాట్లాడుతున్నారు. కాని ఆడదిమాత్రం నిర్భయంగా కూర్చుంది.

"నువ్వు టిక్కెట్టు కొన్నావా?" అని ప్రశ్నించాను.

"లేదు బాబు" అని మహా నిర్లక్ష్యంగా జవాబిచ్చింది.

"ఏం? ఎందుకు కొనలేదు?"

"వారానికి నాలుగుసార్లొస్తానుకదా, టికెట్టు కొనగలనూ బాబూ, సచ్చిపోనూ" అన్నాది అతి తేలిగ్గా.

"మరి వాళ్లు పట్టుకోరా?"

"మామూళ్ళుంటాయి బాబు. లేకపోతే సచ్చిపోం బాబూ. ఈయ నెవడో కొత్తోడిలాగున్నాడు. ఇంకా పటీ, తెలీదు. అంసేతే ఆల్లతో తగువుబడుతున్నాడు"

"వాళ్లెవరు?"

"మావోల్లే బాబు. మేమంతా డబ్బెత్తి ఆలకిస్తే ఆల్లే యిదంతా సమురుబాటుసేస్తారు"

"మీరు లంచాలుకూడా యిస్తారన్నమాట"

"లేకపోతే ఎలాగౌతాది బాబూ. ఇంపాలో ఒక్కొక్కడు ఒక్కొక్కలాగుచ్చుకుంటాడు. సలీం బాబున్నాడే ఆయనకి జట్టుకి రెండు రూపాయలిస్తే సాలు. సాయిబయితే నేం బాబు, దరమరాజు" అన్నాది ఆడది. నా కాశ్చర్యం వేసింది. లంచగొండి ఉద్యోగులు ధర్మరాజులట. ఎంత అజ్ఞానం ?

"అయితే యిందాకొచ్చిన రేషనువాళ్లంటే ఎందుకంత భయపడ్డారు? వాళ్ళకు కూడా లంచమిస్తే వూరుకుంటారుగా?"

"ఆ ఖ్ళుచ్చుకోరు బాబు, ఆ ల్లుచ్చుకుంటేనా? ఓ, ఇంక అడిగినారా!"

"ఏం? వాళ్ళెందుకు పుచ్చుకోరు?"

"ఏటో బాబు, ఆ ల్లుచ్చుకోరు"

"వాళ్ళు మీదగ్గర బియ్యం పట్టుకుని తీసుకుంటారా?"

"మొగాళ్లదగ్గరా, పిల్లలదగ్గరా లాక్కుంటారు బాబు, కాని ఆడోల్లదగ్గిర కష్టం. ఏంచేతంటారు? మేము బియ్యం నడుముకీ, కిడుపుకీ కట్టేసుకుంటాంకదా? ఆల్లు మా బట్టలిప్పా లేరు, మాసేత యిప్పించాలేరు" అన్నాది తమ తెలివితేటలకి గర్వపడుతూ. నాకు చాల ఆశ్చర్యమేసింది. ఢిల్లీలో విలాసాల వాతావరణంలో, సుఖజీవులమధ్య నివసిస్తూన్న నాకు, జీవితమంటే కోనేరు కాదనీ, అది నిరవధికమైన మహా సముద్రమనీ ఏం తెలుసు? మేడల్లో నివసించే భోగజీవులను తప్ప, మేడల నీడల్లో బతికే బతుకులను నే నేం చూసేను? ఈనాడు యిక్కడ జీవితంలో ఒక కొత్త కోణాన్ని దర్శించాను. వీళ్లకి చదువు లేదు, ఆస్తిలేదు, ధనంలేదు, ఏమీ లేదు. వాళ్లం

దుకు బతుకుతున్నారో వాళ్ళకే తెలీదు. బతకడంకోసం ఎంత శ్రమ, ఎన్నికష్టాలు, ఎన్ని అవమానాలు! వాళ్ళీ అవమానాలకీ, హీనతకీ ఎంత అలవాటుపడ్డారు! పాపం! అందుకే అన్నాడు కవి, 'అంతేలే పేదలబతుకులు, తిరిపెమునకు పిడికెడు మెతుకులు' అని. నా అజ్ఞానానికి నాలో నేను సిగ్గుపడ్డాను.

మళ్ళీ పెట్టిలో జనం గోలచేస్తున్నారు. వాళ్ళంతా టికెట్టు కలక్టరుచుట్టూ మూగేరు. టిక్కెట్టు కలక్టరు వాళ్ళతో దెబ్బలాడుతున్నాడు. గట్టిగా కేకలేస్తున్నాడు. నా కెదురుగుండా కూర్చున్న ఆడదికూడా లేచివెళ్ళింది.

"రచ్చించండి బాబూ, ఏదో బీదాబిక్కీమీద పగతీరుసుకోకండి బాబయ్యా" అంటున్నది. కాని టికట్ కలక్టరు వినిపించుకోలేదు. కోపంతో మండిపోతున్నాడు. కారణం ఏదో వేరే అయివుంటుంది. టికెట్లు లేకపోతే అంత పెద్ద తగువుకాదు. వాళ్ళతో ఎవరేనా అతన్ని చెడ్డమాట అనివుంటారు, లేదా ఎక్కువ ఆశపెట్టి తక్కువ యిచ్చి వుంటారు. లేకపోతే యీతడు కొత్తవాడు కావడంవల్ల లంచమంటే అసహ్యించుకొని వుంటాడు. లేకపోతే అతని కంత కోపమెందు కొస్తుంది.

"కోప మెందుకు బాబయ్యా, పోనీ మరో రెండెక్కువ తీసుకో బాబూ" అన్నది ఆడది.

"ఛీ లంజముండా, లంచ మిస్తావా నాకు" అని కోపంతో ఒళ్ళు తెలీకుండా లెంపకాయ కొట్టి, బియ్యమున్నచోట బట్టపట్టుకు లాగేడు. బట్ట కొంచెం జారింది. బియ్యమన్నీ నేలపడి చెదిరిపోయాయి. ఆడవాళ్లు భయంతో గొల్లు

మన్నారు. ఇలా జరుగుతుందని ఆడది అనుకోలేదు. కోపంలో ఆవేశంలో యిలా చేశాడు కాని లేకపోతే ఎవ్వరూ యిలా చెయ్యరు. ఆడది వెంటనే భయంతో బిక్కచచ్చిపోయింది. నలుగురిలో ఎంత అవమానం! నేలపై చెదిరివున్న బియ్యంవేపు చూసింది. దుఃఖంతో ఆమెకళ్ళ నీళ్ళు తిరిగేయి. వెంటనే రోషంతో, కోపంతో మతిపోయిన, పగబట్టిన పాములా బుస కొట్టింది—"ఆడదాని బట్టొట్టుకు లాగుతావురా! నీ కప్ప సెల్లెళ్ళు లేరురా, సేతులెలా వొచ్చినాయిరా, నా కొడకా" అంటూ ఫెడీమని చెంపకేసికొట్టింది. అప్పటి కాతడు ద్వారం దగ్గర నిలుచుని వున్నాడు. తలుపు తీసేవుంది. దెబ్బకు కొంచెం జోగి, మొహంతిరిగి వెనక్కిపడిపోయాడు. ఆడది కెవ్వుమని కేకపెట్టింది. బండిలోవాళ్ళు గొల్లుమన్నారు. చీకట్లో వంతెనకింద అడుగున నది నిశ్శబ్దంగా ప్రవహిస్తూంది. నా కాళ్ళ దగ్గిర చెదిరిన బియ్యపుగింజలు నవ్వుతున్నట్లున్నాయి. ఆహారసమస్య అంటే ఏమిటో అర్థమయింది.

రచనాకాలం: సెప్టెంబరు 1951

—o—

# పొగచూరిన గోడలు

ఒక బండీ, రెండెడ్లూ ఒక చిన్న మడిచెక్కా, తాటిపెండె— ఇదీ తన ఆస్తి. దీని సిగ తరగా, వొంటికి ఏభై యేళ్ళొచ్చాక యీమాత్రం చేసుకోవడానికి యింటిల్లపాదీ రెక్కలు విరుచుకోవలసివచ్చింది. ఛీ ఎదవబతుకు! అనుకున్నాడు అప్పన్న. అయితే యీ వూరిలో యీమాత్రం ఎవరికుంది, అని సంతృప్తిపడ్డాడు మళ్ళీ.

బాగా రాత్రయిందేమో చీకటి దట్టంగా కాటుకలా వుంది. అయితే నేం, తన వూరు పొలిమేరకు వచ్చేశాడు అప్పన్న. ఈ ప్రదేశంతో తనకు ఏభై ఏళ్ళ పరిచయముంది. ఇంక తను కళ్ళుమూసుకుని యింటికి చేరుకోగలడు. చెరువు గట్టుమీద పురుగూ బుట్రా కాళ్ళలో పడకుండా చేతిలో మువ్వకట్టిన చేపాటి కర్రచప్పుడు చేసుకుంటూ నడుస్తున్నాడు అప్పన్న. అంతా అతి నిశ్శబ్దంగా ఉంది. కనుచూపుమే దూరంలో, తన ఊరిలో వొకటి రెండుదీపాలు, వొకటిరెండు చిన్నచిన్న చలిమంటలు మసకమసగ్గా కనిపిస్తున్నాయి. ముసలితనంలో కొంచెం రేచీకటున్నది అప్పన్నకి. అయినా అ తన పనుల కేమీ అడ్డురాలేదు యింతవరకూ. చెరువుగట్టు మీద ఓ నిముషం నిలబడి తలెత్తి వూరువేపుచూశాడు. చీకటిలో దృష్టి కేదీ సమంగా అనలేదు. ఇదేమిటీ ఊరు అప్పుడే నిద్రపోతూందేమిటి అనుకున్నాడు. ఈ ఊరు తన తల్లిదండ్రులు, తాతముత్తాతలు, తను పుట్టిపెరిగిన వూరు. కాని

ఇప్పుడు ఈ ఊరంటే అసహ్యమేస్తూంది; వొళ్లు మండుతూంది. ఊళ్లో ఎవళ్ళకీ తాగడానికి గంజినీళ్లు లేవు. కాని బ్రతిరుగుడు చూస్తే ఎక్కువ. మంచీ, మర్యాదా, న్యాయం, ధర్మం అనేవి ఎవరిదగ్గరా లేవు; ఎవడికీ బతకడం చాతకాదు; ఎవడైనా బతుకుతూంటే చూడలేరు. ఎవడూ మంచిగా వుండడు; ఎవడేనా మంచిగావుంటే వుండనివ్వరు. తను కొత్తగా బండీ, ఎడ్లూ కొన్నాడు. ఊళ్లో ఎవడికీ యిటువంటి ఎడ్లుగాని, బండిగాని లేవు. ఊరంతాకలిసి ఓ వంద కొంపలున్నా పట్టుమని నాలుగుజత లెడ్లు లేవు. అవికూడా రేపో ఎల్లుండో చచ్చేటట్లుంటాయి. అంచేత ఈ ఊరివాళ్లందరికి కడుపుమంట. ఛీ! అనుకుంటూ నడుస్తున్నాడు.

ఊళ్ళో అందరూ అసలే దరిద్రులు. దానికితోడు చాలమంది సోమరిపోతులు. డబ్బంటే అందరికీ ఆశే. కాని ఎవడికీ ఆర్జించడం చాతకాదు. ఒక పూటకి గంజినీళ్ళుదొరికితే రెండుపూటలు పనిచెయ్యరు. కాని ఎవడేనా కష్టపడి సంపాదించుకుంటేమాత్రం చూడలేరు. అందరికీ దేవుడంటే పరమభక్తి, అతి భయం. కాని అంతా పాపాలు చేస్తూనే వుంటారు. చిత్రం!

తనంటే వాళ్ళకి ఈర్ష్య. తనకిమాత్రం ఏముంది? తన తండ్రి తన కా యిల్లూ, ఈ చేపాటికర్రా వదలిపెట్టాడు. తన కష్టార్జితంగా ఎడ్లూ ఓ మడిచెక్క సంపాదించేడు. ఈమధ్య బండీ ఎడ్లూ కొన్నాడు. అయితే తను కష్టపడి పనిచేస్తాడు. తన పెళ్ళాం పొలంలో పనిచేస్తుంది. కూతురు వీధిలో బండ రాయిమీద చిన్న దుకాణంపెట్టి ఎండు చేపలూ, గోంగూర,

మిరపకాయలు, ఉల్లిపాయలు అమ్ముతుంది. పేడ తెచ్చి, పిడకలుపెట్టి బ్రాహ్మలకూ, కోమట్లకూ అమ్ముతుంది. కొడుకు చిన్నవాడైనా మంచి ప్రయోజకుడు. ఇలా యింటిల్లపాదీ కష్టపడి నాలుగు రాళ్ళు చేసుకుంటే వూరిబాబుగారి సొమ్మేదో పడేసుకున్నట్టు యీ వూరివాళ్ళ కెందుకు కడుపుమంట ?

తమ బండీ, ఎద్లూ కొన్నాక తన జాగాలోనే తనఇంటి పక్కన సాల వేసుకుందామని, బ్రాహ్మలింటికెళ్ళి మంచిరోజు కనుక్కుని, నేరడరాట తెచ్చి పాతేడు. ఊరువాళ్ళందరికీ మహా కడుపుమంటగావుంది. వీడు సాల ఎలాగేస్తాడో చూడమా అంటూ నలుగురూ చేరేరు. సాల వెయ్యడానికి వీలు లేదన్నారు. అది తన జాగా అన్న విషయం లోకమందరికీ తెలుసన్నాడు. వాళ్ళు కాదన్నారు. అయితే మరి ఎవరిది ? ఏ వొక్కడికీ ఆ జాగా తనదని చెప్పడానికి గుండె ల్లేకపోయాయి. అందులో ఓ తెలివైనవాడు, ఆ జాగా ఎవరిదీ కాదు అమ్మవారిదన్నాడు. ఇంకేం, మంచి సాకు దొరికింది. ఆ జాగాకి కొంత దూరంలో వొక రాయివుంది. దానికి పూజా పునస్కారం జరుగుతుంది. కాని ఈ జాగామాత్రం తనదే నన్నాడు. కావేషీలు పెరిగాయి; దొమ్మలాట జరిగింది. కోర్టుకెక్కుతా నన్నాడు కాని కేసు పోతుందని తెలిసి వాళ్ళు వూరుకున్నారు. కాని అప్పటినుండి వాళ్లకి మరీ కడుపుమంటగా వుంది; కావేషీలు బాగా పెరిగిపోయాయి.

వాళ్లకి మనసులో కోపముంటే నాదగ్గరకొచ్చి చూపించరాదా? నోరులేని జంతువు అదేం చేసింది? అనుకున్నాడు అప్పన్న. సలసల కాగిన గంజితెచ్చి తన ఎద్దుమీదపోశారు;

అరిచెయ్యిమేరచర్మం, కాలిపోయింది. ఎంత బాధపడుతూందో? అరవదు, లేవదు, గడ్డి తినదు, కుడితి తాగదు. పాపం నోరు లేని జంతువు, అదేం తప్పు చేసింది ? అనుకుంటూ మెల్లిగా నడుస్తున్నాడు.

పొన్నూరు మంగలాడికి పసువులవైద్యం తెలుసునంటే అక్కడికి పరుగెట్టేడు అప్పన్న. వాడు పావలా పుచ్చుకొని నూనెలో మందు కలిపిచ్చాడు. ఈ నూనె రాసి జల్లేడాకేసి కట్టమన్నాడు. రెండు రోజులకల్లా పుండు నల్లగా మాడిపో తుంది చూచుకోమన్నాడు. చేతిలో పట్టుకున్న కొబ్బరిచిప్పలో నూనె వుందో వొలికిపోయిందో అని వేలుపెట్టి చూశాడు అప్పన్న.

కొంచెం దూరాన్న మామిడిచెట్లమధ్య నల్లమారమ్మ గుడి తెల్లగా కనిపిస్తూంది. లోపల చిన్న దీపంకూడా వెలుగు తూన్నట్టుంది. గుడివేపు తిరిగి, చేతిలో చిప్ప నేలపెట్టి దండం పెట్టుకున్నాడు. "తల్లీ నల్లమారమ్మ, రచ్చించు తల్లీ, ఎద్దు లేచి తిరుగుతే నీకు కోడిపిల్ల నిచ్చుకుంటాను తల్లీ"అని మొక్కు కుని మళ్ళీ నడక మొదలెట్టాడు అప్పన్న. కాలి కేదో గట్టిగా తగిలింది. "హై దీని సిగ్గొయ్య. ఏటది? నాగలిముక్క. అరి! ఈళ్ళు నా దారికడ్డంగా వొగ్గీశారేటి?" అని తిట్టుకుంటూ కాలితోటి దానిని చెరువులోకి తోసేశాడు. చెరువులో నీరు లేదులే తుమ్మచెక్క నానిపోవడానికి అనుకున్నాడు. తన వూరుకూడా ఈ చెరువులాగేవుంది. పటంనూర్పులైన నాలుగు రోజులూ ఊరు కలకలలాడినట్లే వర్షాలుపడిన నాలుగురోజులూ చెరువులో నీళ్ళుంటాయి. తరవాత కాలమంతా చెరువు

గర్భంలో బారెడు మేర బురదనీళ్ళు; ఊళ్లో కొంచెం గంజి నీళ్ళు—అంతే. ఛీ! ఏం బతుకు! అనుకున్నాడు.

ఊరు దగ్గరపడింది. ఈ గట్టుదాటితే ఊరు. చీకట్లో ఒక కాగడా, డోలక్కు భజనా తనవేపు వస్తున్నాయి. "నారాయణ, నారాయణ" అనుకుంటూ ఎవరో శవాన్ని మోసుకొస్తున్నారు. "ఇదేటి యింటికాడ కొస్తుంటే శవ మెదురు పడింది? చీతారాం, చీతారాం" అనుకున్నాడు అప్పన్న. బూరుగుచెట్టుకింద కొచ్చేసరికి భజన దగ్గరపడింది. మాలాళ్లు భజన చేస్తున్నారు. ఆ వూరికి భజనపార్టీ అదొక్కటే. ఎవరుచచ్చినా యీ మాల చిన్నిగాడి భజనపార్టీని పిలుచుకు పోతారు.

"ఎవరురా సిన్నిగా" అన్నాడు అప్పన్న.

"గొల్ల రామయ్యకొడుకు"

"అలాగా" అన్నాడు అప్పన్న పరధ్యాన్నంగా.

"రెండు మేకలున్నాయి గదా, నాలుగు రెమ్మ లిరుద్దామని బాపనోళ్ల రావిసెట్టెక్కినాడు. నాగుపాము కుట్టేసింది."

"రామ రామ"

"అక్కడ నాగుపా ముందని అందరికీ తెలుసు. ఆడికీ తెలుసు. కాని ఆడి కరమంకాకపోతే ఆ మారాజు జోలి కెందుకెళ్లాలీడు, సెప్పు? మంత్రాలు తంత్రాలు ఏయించినారు. కాని ఏటి నాబం?" అని చెప్పుకెళ్ళిపోతున్నాడు సిన్నిగాడు. అప్పన్న కీదంతా వినాలని కుతూహలంలేదు. "పోసీ నేరా ఎందు కా సొద, ఆడి కాయురుదాయం సెల్లింది. ఎవ డేటి

సెయ్యగలడు. కాని సిన్నిగా, మా యింటిపెప్పుగాని ఎల్లినా వేట్రా, ఎద్దు కెలాగుందో ఏమైనా తెలుసా?" అన్నాడు అప్పన్న ఆత్రుతగా.

"నీ ఎద్దు కేట్రా, మారాజునా గుంది. చాకలి సత్తిగాడు దిప్టితీసి జిల్లేడాకు కట్టమన్నాడట. నీ కోడలు కొడవలి కాల్చి, అగ్గితీసి, బుగ్గితీసి దిష్టితీసి పెంటమీద వాడేసింది. జిల్లుడాకు లేరి ఆవదంలో ముంచి కట్టేసింది. ఎద్దు మారాజులా నెగిచి తిరుగుతూంది" అని చరచర నడిచివెళ్ళేడు సిన్నిగాడు. తన్ను వదిలిపెట్టి భజనపార్టీ వెళిపోతూంది. పరుగెత్తి వెళ్ళి కలుసుకొన్నాడు. "గూటిలోని రావసిలకా గూడు దాటిపోయెరా..." అని పాడుకుంటూ భజనపార్టీ సాగిపోయింది. "అమ్మయ్య, బతికింది ఎద్దు. ఇంతకీ తన పెళ్లాం తెలవైంది" అనుకుంటూ తాటిపెంటలోంచి నడిచేడు అప్పన్న. యిల్లు దగ్గరపడింది. ఇం కేముంది ఈ తాటిపెండె దాటితే తన ఇల్లు.

"అమ్మయ్య ఎద్దు బతికింది. తల్లి మాలచ్మి, నల్లమారమ్మ రచ్చిత్తే ఈ ఊరోళ్లేటిసెయ్యగలరు" అని మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. ఎద్దు చస్తే నూరురూపాయిలు నష్టం. కానీ పరకా గనుకనా—ఇంతకీ తన పెళ్లాం పిల్లలూ అదృష్టవంతులు. ఈ బండి కాని సంతలకి తోలితే వాకేసారికి అయిదారు రూపాయలు దొరుకుతాయి. పట్టుమని నాలుగు నెలలు తోలితే నూరు రూపాయలు చెయ్యవచ్చును. కూతురికి భజంత్రీమేళం, గేసులైటూ పెట్టి పెళ్ళిచెయ్యొచ్చును. పట్నం సంబంధమే చెయ్యాలి. పట్నంపోతే నాలుగు మెతుకులు

తింటుంది. ఛీ, ఊళ్లోసంబంధంమాత్రం చస్తే చెయ్యకూడదు. గంజికి లేని దరిద్రులు.

గొల్లుమని గోల వినిపిస్తూంది. పరధ్యానంనుండి ఒక్కసారి మేలుకుని తలెత్తిచూసేడు. ఇం కేముంది ఊరు అంటుకుంది. మంటలు ఎర్రగా ఆకాశానికి ఎగురుతున్నాయి. "ఓరి బాబోయ్, సాలలో ఎడ్లుండిపోనాయ్ బాబో, యిప్పినారో లేదో..." అని అరుచుకుంటూ పరిగెత్తాడు అప్పన్న.

ఊరంతా అల్లకల్లోలంగా వుంది. మంచాలూ, చింకి పాతలూ అవీ దారికడ్డంగా పారేశారు. ఆడాళ్ళు, పిల్లలూ అటూ యిటూ పరుగెత్తుతున్నారు. ఏడుపులు, మొర్రలు, తిట్లు, శాపాలు.

అప్పన్న పరుగెత్తుకుంటూ ఇంటిదగ్గరకొచ్చేడు.

"ఎడ్లు, ఎడ్లు, నచ్చి" అని కేకేశాడు. లచ్చి ఏడుస్తూ, తిట్టుకుంటూవచ్చి "ఇప్పేసి బాపనాళ్ల దొడ్లో వొగ్గిసినాను మావా" అంది. అప్పన్న మనసు కొంచెం కుదుటబడింది. తన సాల కాలిపోయింది.

బండి కాలుతోంది. దగ్గిర కెవరెళ్లగలరు ? ఎవరార్ప గలరు ?

"మన సాలకి జాతిసచ్చినో డెవడో అగ్గెట్టేసినాడు" అంది లచ్చి తిట్టుకుంటూ. పల్లెటూర్లో ఇంటికి నిప్పుపెట్టడం అతి తేలిక, అతి సాధారణం. "సూడలేని యెదవ మన సాలొక్కటే కాలి ఊరుకుంటుందనుకున్నాడేటి" అని వేపచెట్టు కిందకొచ్చి రాతిబండమీదకొచ్చి చతికిలబడ్డాడు. అప్పన్నకి మతిపోయింది. అతడి కేమీ అర్థంకావడంలేదు.

మంటలు పూర్తిగా ఆరిపోయాయి. ఊళ్ళో అల్లరి సద్దు కుంది. "ఊళ్ళో సగంకొంపకాలిపోనాది, మామా" అంటూ లచ్చి దగ్గరగా వచ్చి అప్పన్నవొంటిమీద చెయ్యివేసింది. అప్పన్న వొక్కసారి కళ్లెత్తి లచ్చివేపు చూశాడు.

"ఎలాగున్నావ్"

"బండి కాలిపోయింది. మళ్లీ బండి సేయించాలంటే ఎనబై రూపాయి లవుతాది, ఎక్కడ తెచ్చేది సెప్పు?"

"సరినే, మన మేటి సెయ్యగలం. నెగు, మంచమేత్తాను తొంగుందువుగాని..." అన్నది లచ్చి.

"ఆళ్ళు బతకనేరు, ఇంకోరిని బతకనివ్వరు. ఎదవ జలమ. మనిసి జలమఎత్తగానే సరా" అంటూ లేచి, చెవి లోంచి చుట్టపీకతీసి ఎలిగించి, చెట్టుకింద మంచంమీద నడుం వాల్చి పడుకున్నాడు అప్పన్న.

చీకట్లో ఆకాశంమీద చుక్కలు మిలమిల మెరుస్తు న్నాయి. వేపచెట్టుమీది గబ్బిలాలు రెక్కలు చప్పుడు చేస్తున్నాయి. అప్పన్నకి నిద్ర పట్టడంలేదు. ఇలా తనీ వూళ్లో ఎంతకాలం బతగ్గలడు? ఊరంతా విరోధులే. తనెవ్వరికీ వుపకారం చెయ్యనిమాట నిజమే. కాని తను ఎవ్వరికీ అప కారంకూడా చెయ్యలేదు. తను ఎవడికడుపూ కొట్టి అన్యా యంగా డబ్బు సంపాదించలేదు. తన రెక్కలు విరుచుకొని, చెమటోడ్చి నాలుగురాళ్ళు చేసుకున్నాడు. అయితే మరి వాళ్ల ఈర్ష్యకు కారణమేమిటి? దారిద్ర్యం, మూర్ఖత్వం, అజ్ఞా నం, అవినీతి వ్యాపించివున్న యీ వూళ్ళో కాసీ లాభ ముందంటే ఎటువంటిపాపాలు చెయ్యడానికైనా వెనుదియ్యరు.

అయితే తన్ను బాధించితే వాళ్ళ కేమిటి లాభం? ఏమీలేదు.

కాని నీతి అన్నది పూర్తిగా చెడిపోయినతరువాత పచ్చగా వున్నవాడిని చూడలేకపోవడమే నీతి అయింది. అయితే వీళ్ళతో విరోధంగా ఈ ఊళ్ళో యింక బతకడం కష్టం. వాళ్ళతో రాజీ చేసుకోవాలి, అని ఆలోచిస్తూండగా ఎప్పుడో నిద్రపట్టింది అప్పన్నకి.

"నెగు, నెగు తెల్లోరింది" అన్నది లచ్చి.

అప్పన్న లేచి కళ్లునులువుకొని, చుట్ట వెలిగించి, కాలిపోయిన మొండిగోడలవేపు చూసేడు—అప్పుడే అంతా యిళ్లు తుడుచుకొని, యిళ్ళల్లో సామాను సద్దుకుని వీధుల్లో తిరుగుతున్నారు. వెదురుబద్దలూ, తాటికమ్మలూ, వున్నవాళ్ళు ఒకరిద్దరు నేతకూడా మొదలుపెట్టేరు. ఎవరి మొహాల్లోనూ యిల్లు కాలిపోయాయనే విచారం ఏమీలేదు. అప్పన్నకు ఎందుకో ఆశ్చర్యమేసింది—

"యిల్లు కాలిపోతే మారాజుల్లా తిరిగేస్తున్నారేటి ?" అన్నాడు అప్పన్న—

"నేకపోతే వురెట్టుకోమంటావేటి! మంచోడివే—" అంటూ లచ్చి మంచం ఎత్తి యింట్లోకి పట్టుకుపోయింది—అవును నిజమే, ఈ వెధవవూరు ఏడాదికి రెండుసార్లయినా కాలుతుంది. రోజూ చచ్చేవాడి కేడ్చేదెవరని ఏడుస్తారు.

"నచ్చి, ఇలా బతకనేమే ఈ ఊర్లో. ఎంత కాలమేటియీ ఇరోదం" అన్నాడు అప్పన్న.

"ఏటి సేత్తారేటి? జాతిసచ్చిన యెదవలు! రానీ కళ్లాపు జల్లుతాను. తీసీరా నాయనా, నాదగ్గరి యీసాలు—"

"నచ్చీ నీకు గ్యానం లేదే. నువ్వే కయ్యానికి కాలు దువ్వినావు. మొదటికాడినుంచి, ఆడోళ్ల నందరినీ నోటి కొచ్చినట్టు తిట్టినావు — ఆల్లని నానా మాట లాడినావు. తప్పు కాదా? ఆల్లతో యిరోదం ఏటిలాబం సెప్పు?" అంటూ బోధపరిచాడు. లచ్చికి డబ్బుందన్న గర్వం లేకపో లేదు. తక్కిన వాళ్లందరినీ తక్కువగా చూడడం, నానా మాట లాడడం కూడా వుంది.

"అయితే ఏటి సెయ్యామంటావేటి? ఆల్ల కాల్లోట్టుకోమంటావేటి?"

"అదికాదే ఎర్రిదానా, ఆల్లతోటి యిరోదమానుకుని, కలిసి మెలిసి నడుసుకుపోతే సరి. ఆల్లతో, యిరోదం పెట్టుకుని మనం బతకనేం. ఇయాలతో రాజీ అయిపోవాల—"అని లేచి నాలుగు చద్దిమెతుకులు తిని కరణంగారింటికి బయలుదేరేడు.

కరణంగారి ఇల్లు పెంకుటిల్లు. ఇంటిముందు ఎత్తుటరుగులున్నాయి. ఈ అరుగులకి పక్కనేవున్న వేపచెట్టు నీడనిస్తుంది. కరణంగారు అరుగుమీద ఠీవిగా కూర్చుని చుట్టపొగ వదులుతున్నారు. చుట్టూ చాలమంది కూర్చున్నారు. ఇళ్ల నేతకి వెదురుబద్దలు, రాటలు, తాటికమ్మా—వీటిగురించి సలహా కొచ్చేరు—

"రామిగాడి తాటిపెండెకమ్మ సాలదు బాబు. తమరో నాలుగు రేకులు సాయంసేత్తే సాలు బాబయ్యా" అన్నాడు గొల్ల వెంకడు.

"ఇద్దనుగాని, ఓ చిన్న చిక్కుందిరా. మా అన్నయ్య గారి కుమార్తెకు వచ్చే శ్రావణంలో వివాహం. ఇక్కడే చేసుకుంటారట. మా వెనక సాలం ఆవులసాల నేయించాలి. పెరట్లో దడి కట్టించాలి. పందిరి వేయించాలి. అంచేత ఇప్పుడు పీలుపడదురా. లేకపోతే వెధవ కమ్మరేకులు భాగ్యమా ఏమిటి?" అన్నాడు కరణం.

ఒకసారిచ్చి అలవాటుచేస్తే ప్రతిసారీ అడుగుతారు--- వెధవ ఊరు, తెల్లవారితే కాలుతూనేవుంటుంది అనుకున్నాడు కరణం. కమ్మరేకులు వాళ్ళకి పెద్ద సమస్య అయింది. ఎలాగ? ఊళ్ళో ఎవడిదగ్గర ఉన్నాయి.

అప్పన్న మెల్లగావచ్చి కరణానికి దండంపెట్టి కూర్చు న్నాడు—

"ఏమోయ్ అప్పన్నా ఏ మిలావచ్చావ్" అని పలక రించాడు కరణం—

"ఏంనేదు బాబు. ఊరు కాలిపోయిందిగదా"అన్నాడు అప్పన్న.

"అయితే నీకేటినేరా. ఏం లేనోడివా? ఈసారి అప్పన్న పెంకుటి ల్లేయిస్తాడు బాబూ" అన్నాడు గొల్ల వెంకడు— గొల్ల వెంకడు ఎండిపోయిన ములంచెట్టులా ఉంటాడు. గోచీ తప్ప రెండో బట్ట కట్టి ఎరుగడు.

అప్పన్నకి విసుడు అర్ధమయింది. కాని తను దెబ్బ లాటకి రాలేదు. ఎలాగైనా రాజీ చేసుకుందామనే సంక ల్పంతో వచ్చాడు.

"కమ్మరేకులు గురించి మాట్లాడుతున్నావేమోయ్. నీకు తాటిపెండె వుందికదూ" అన్నాడు కరణం.

"నేకేం బాబూ—అయితే ఓ సిన్న మనవి బాబు, యినండి. తొలీత మా ఇల్లంటుకుంది. ఎలా గంటుకుందో ఆ పాపం పున్నెం బగమంతుడి కెరిక. పోతే పోనీ, ఊరంతా కాలిపోయినాదికదా. ఎవరేటి సెయ్యగలం. కాని బాబయ్యా ఈ ఇరోదాలు ఎంతకాలం బాబయ్యా. ఒకూర్లో ఉన్నతరువాత కట్టమొచ్చినా సుకమొచ్చినా. వొకడి కొకడు కాకపోతే ఎనాగు! బాబు, ఈళ్ళతో నాకు ఇరోదం నేదు; నే నెవడికీ అపకారం సెయ్యనేదు బాబయ్యా. నా సేతనయితే సాయం సేయడానికీకూడా తయారుగున్నాను. ఈ ఏలతో అంతా సదుకుకుపోవాల" అన్నాడు అప్పన్న.

బయలుదేరినాడు బాబు కావందు—అందరినీ అందుకుంటూ డిక—"అన్నాడు రామునాయుడు. రామునాయుడి శరీరమంతటికి మీసాలే బలంగా కనిపిస్తాయి. గ్రొరెపందేల్లో డబ్బంతా కర్చయిపోయినా మీసాలుమాత్రం చెక్కుచెదరకుండా మిగిలాయి. అప్పన్న ఈ మాటలను లక్ష్యపెట్టక మళ్లీ అందుకున్నాడు. "బాబో నాకు తాటిపెండుంది. కమ్మరేకులు వొత్తుగున్నాయి. నా ఇంటికీ, సాలకీ కాక మరో రెండిల్లకి సరిపోయే రేకులున్నాయి. కట్టమనేది అందరికీ వొత్తాది. ఒకడి నొకడు ఆదుకోకపోతే ఎనాగ? కావలసినో డొచ్చి నాలుగు రేకులు కొట్టుకోమను బాబు—నే వొద్దన్నానేటి—అవుసరం అందరికి వొత్తాది. అంతేకాదు బాబయ్యా—నా బండి కాలిపోనాది—నా గొడ్లకి పనినేదు—ఏరువ్రాతకాలం

గదా—ఊర్లో అందరం పూసుకోవచ్చు వాటీని — ఏటి బాబు— ఏటుంటిపోతాది? పోయేటప్పు డొట్టికెల్లిపోతా మేమిటిబాబయ్యా—సెప్పండిబాబు తెలిసినోరు—"అన్నాడు అప్పన్న—

సభలో గుసగుసలు బయలుదేరాయి. రామునాయుని కిది ఇష్టంలేదు. రామునాయుడు వాళ్ళందరకీ నాయకుడు. అతని కదే గర్వం. అప్పన్నంటే వాడికి మహాకోపం. ఈర్ష్య— కారణం అప్పన్న డబ్బున్నవాడు. డబ్బుతో వాడికి పలుకు బడికూడా రావచ్చును. అప్పుడే తన విలువ తగ్గిపోతుందేమో నని అతనికీ అనుమానంగావుంది. అప్పన్నని విచ్చలవిడిగా వొదిలేస్తే ఇంకేముంది. మరో నాలుగురోజులుపోతే వాడి ముందు తను దిగదుడుపు అవుతాడు.

"చాల్లేరా, నువ్వొచ్చినావు మే ముచ్చుకున్నాము—" అన్నాడు మీసాలు మెలివేస్తూ. కాని కొంతమందికి అప్పన్న సలహా సబబుగానే ఉందనిపించింది. కష్టమొచ్చిన సమయంలో సాయం చెయ్యడానికొచ్చేడు. ఈ సమయంలో ఇంకోడైతే వీళ్ళందరినీ ఏడిపిస్తాడు.

"అప్పన్న సెప్పింది సబబుగానే వుందేస్. ఎల్లకాలం ఇగోదమేటి? పొన్నూరో డెవడేనా సూత్తే మొగంమీద దూసే త్తాడు" అన్నాడు చాకలి సత్తిగాడు. సత్తిగాడిని కొంతమంది బలపరిచారు. అప్పన్న మంచివాడు. వా డెవరికీ అపకారం చెయ్యలేదన్నారుకూడా కొందరు; "బాగుందేస్, అప్పన్న సెప్పిందే సత్తెం—నేకపోతే ఆడు ఊర్లో పుట్టిపెరిగినాడు, ఆడి తోటి యిగోదమేటి, మూరకత్వం—"అన్నాడు గొల్ల వెంకడు.

గొల్ల వెంకడు ఈ మాటనడం కొందరికి ఆశ్చర్యమేసింది. వాడు రెండో నాయకుడు—ఇంకేముంది, అంతా దారిలోకొచ్చారన్నమాట. అప్పన్నకి ధైర్యమొచ్చింది. ఫలించింది తన పథకం. కాని కొంతమంది ఒప్పుకోలేదు—వాడిదగ్గర యీ రోజు నాలుగు కమ్మరేకులు పుచ్చుకుంటే మరీ అలుసయిపోతామన్నారు కొంతమంది. రామునాయుడికి ఇష్టంలేదు అప్పన్నతో రాజీచేసుకోవడం—కాని గొల్ల వెంకడు మాత్రం అప్పన్న సహాయంతో సిఫచ్చకూడదన్నాడు—అంటే నాయకత్వం చీలిపోయింది. కాని ఎవరూ ఒక నిర్ధారణకూ, నిర్ణయానికీ రాలేకపోయారు—రామునాయుడు వయసులోనూ, జాతిలోనూ, పలుకుబడిలోనూ పెద్దవాడు—నిరాటంకంగా నాయకత్వం నిర్వహించినవాడు—ఛటుక్కున లేచి, కోపంగా కర్ర నేలకు కొట్టేడు; మీసాలు మెలివేసి గుడ్లెర్రజేసేడు. కూర్చున్నవాళ్ళంతా వాడివేపే చూస్తున్నారు—అందరినీ తనవేపుకి మెల్లిగా లాక్కున్నాడు. చివరి నిర్ణయం తనచేతిలోకి వచ్చింది—వీటో ప్రయోగించేడు—

ఓ రెల్లంౘ్రడా—మా గనవైన దర్మరాజు బయలుదేరినాడు—నెగండ్రా" అని గబాలున లేచి, తుబుక్కున వుమ్మి బయలుదేరేడు—అంతా హాలోమని లేచారు. పకపక నవ్వుకుంటూ నాయుడి వెనకాతల వెళ్ళిపోయారు.

అప్పన్న కేమీ తోచలేదు. ఏమీ అర్థం కాలేదు. ఇంటికొచ్చి వీధిలో నులకమంచంమీద కాళ్ళు చాచుకుని పడుకున్నాడు—ఎదురుగుండా మసిబారిన మొండిగోడలు నవ్వుతున్నట్లు కనిపించేయి.



# చీకటిదేశం

రాధ నాలుగోక్లాసు చదువుతోంది. రాధంటే వా ళ్ళమ్మకీ నాన్నకీ చాలాముద్దు. నాలుగోక్లాసు చదువుతోందని కాదు. చదవకపోయినా ముద్దే బడికెళ్ళేముందు వాళ్ళమ్మ రాధకి నీళ్ళుపోసి, తలదువ్వి, గౌనువేసి "జాగ్రత్తగా వెళ్ళిరా తల్లీ" అని నరిసిగాడిని సాయమిచ్చి పంపిస్తుంది. నరిసిగాడు రాకపోతే మరెవరేనా దిగబెట్టి రావలసిందే. "దగ్గిరేకదూ బడి, ఒక్కర్తే వెళిపోతుందిలే" అని వాళ్లనాన్న ఎప్పుడేనా అంటే "అమ్మో చిన్నముండ, ఒక్కర్తె ఎలా వెళ్లుతుందండీ, మీకు వెర్రిగాని, అయినా బడిపిల్లలు పెంకివెధవలు-దారిలో అమ్మాయి నెవరేనా పలకతో తలమీదకొడితే, పెనిసిలుతో కంట్లో పొడిస్తే ఏందారి? మీ రెళ్ళి దిగబెట్టిరండి - లేదా: నే వెళ్లొస్తాను" అంటుంది వాళ్లమ్మ—వాళ్లమ్మ నోటికి తాళం వెయ్యలేం—

రాత్రి ఎక్కాలు కంఠతాపెడుతూంటే వాళ్లమ్మ రాత్రిళ్లు ఎక్కువసేపు మేలుకోవద్దని కోప్పడి పడుకోబెట్టింది-కాని రాధ ఒకంతకి నిద్దరపోదు—వాళ్లమ్మని మాటలతో కాల్చుకుతింటుంది—

"అమ్మా, నిద్దరరాదే" అన్నది రాధ—

"గట్టిగా కళ్లు మూసుకుపడుకో తల్లీ—అదే వస్తుంది" అన్నది వాళ్లమ్మ—

"అమ్మా, ఎక్కాలు చదవకపోతే మాష్టారు కోప్పడు తారేమో రేపు" అని సందేహంగా అంది రాధ.

"వెధ వెక్కాలు, రాకపోతే పోనీలే తల్లీ--నువ్వేం ఉద్యోగాలు చెయ్యనక్కర్లేదు - ఊళ్ళేలక్కర్లేదు— మీ నాన్నగారు, మేష్టరుగారికి కబురుపెడతారులే నిన్నేమీ అనొద్దని" అంటూ రాధవీపుమీద చేత్తో జోకొట్టింది వాళ్ళమ్మ.

"నాన్నంటే మాష్టారుకి ఎందుకూ భయం" మళ్ళీ అడిగింది రాధ.

"మీ నాన్న తాశిల్దారు—అందుచేత ఊళ్ళో అంతా భయపడతారు. ఇంక పడుకో—"

"మా మాష్టారు చాలామంచివారు" అంటూ గొణుగు తోంది రాధ.

"పడుకో అమ్మా, ఇంక నన్ను విసిగించక—"

కాని రాధకి నిద్రపట్టలేదు. పక్కకి వొత్తిగిల్లి కిటికీ లోంచి చూస్తోంది.

చీకటి కంబళిలా నల్లగా ఉంది. అవతల గుడిశలోంచి రామిగాడు దీపపుబుడ్డిముందు కూర్చుని ఎక్కాలు గట్టిగా బట్టీవేస్తున్నాడు. రామిగాడూ నాలుగో క్లాసే. కాని రాత్రిళ్లు చదవకపోతే వాళ్ళనాన్న తంతాడు. రామిగాడికి పదహారెక్కాలు కంఠతా వచ్చు. ఏ బీ సీ డీ లన్నీ రాసీ గలడు. కాకీ, మాంసప్రముక్కా కథ పుస్తకం చూడకుండా అప్పచెప్పగలడు. పరీక్షల్లో ఫస్టుమార్కు వచ్చింది. క్లాసులో పిల్లలకి వాడంటే భయం. వాడి నెవరూ ఏమీ అనరు. ఎవరేనా అంటే జల్లులుకొడతాడు. నల్లగా ఎలుగుబంటిలా

ఉంటాడు. రాధ వాడికోసారి తెల్లకాగితా లిచ్చింది. అంచేత రాధంటే వాడి కిష్టం.

మన్నాడు పొద్దున్న రాధ బడికి బయలుదేరింది— రామిగాడు వీధిగుమ్మంలోకొచ్చి "రాధా వస్తావా బడికి" అని కేకేశాడు. రామిగాడు లాగు, వాళ్ళనాన్న చిరిగినబనీను వేసుకున్నాడు. తలకీ ముఖానికీ నూనె రాసుకున్నాడు— ఎండలో వాడి శరీరం నల్లటి గాజుపెంకులా మెరుస్తోంది—

"కొత్త కారొచ్చింది. మా నాన్న వస్తున్నారు నన్ను దిగబెట్టడానికి" అన్నాది రాధ—

"ఓస్, పిరికి—నేనుంటే ఇంకా ఏం భయం" అని గర్వంగా నవ్వేడు రామిగాడు—

"ఇక్కడున్న బడికి కారెందుకూ ?" రాధనాన్నగారు వీధిలోకొచ్చి రామిగాడినిచూసి "ఏడెవడు—వెధవ" అన్నారు.

"రామిగాడు"

"నీగ్రో వెధవ—ఫో" అన్నారు వాళ్ళ నాన్నగారు— రామిగాడు పరిగెత్తేడు—

"నీగ్రో అంటే ఏమిటి నాన్నా" అన్నాది రాధ—

"నీగ్రో అంటే వీడిలాగే నల్లగావుండే వెధవలన్న మాట" అని నవ్వేడు వాళ్ళనాన్నగారు. రాధకూడా నవ్వింది— "అహోయ్, నీగ్రో" అని మళ్ళీ నవ్వింది—

బడిదగ్గర రావిచెట్టుకింద పిల్లలంతా, పెంకుముక్కలేరి వెనుకనున్న చెరువులోకి విసురుతున్నారు—రామిగాడు రాధ దగ్గరకెళ్ళి 'ఎక్కాలు వచ్చా' అన్నాడు; రాధకి నవ్వొచ్చి

'అహోయ్, నీగ్రో' అని పకపకమని నవ్వింది; పిల్లలంతా రామిగాడిచుట్టూ చేరి 'నీగ్రో, నీగ్రో' అనే కేక లేసి నవ్వేరు; రామిగాడికి కోపమొచ్చి, తేలుకుట్టినట్లు కేకలేశాడు. పిల్లలు మరింత ఉడికించారు; ఇంతలో బడిగంట కొట్టేరు.

క్లాసులో మాష్టరుగారు, రామిగాడిని ఎక్కాలు అప్పచెప్పమన్నారు. రామిగాడు లేచి నిలుచుని, మాష్టరుగారి పొడుంవాసనకి ఒక తుమ్ము తుమ్మేడు; వెనకాతలనుంచి ఎవడో 'నీగ్రో' అన్నాడు. పిల్లలందరూ నవ్వేరు; అందరూ మళ్ళీ అన్నారు.

"ఏమిటా అల్లరి" అని మాష్టరుగారు కోపంగా కసిరేరు. రామిగాడు ఏడుపుమొహం పెట్టి "పిల్లంతా నన్ను నీగ్రో అంటున్నారు" అన్నాడు. "అలాగా" అని మేష్టరుగారు బెత్తంపట్టుకుని ముందుకొచ్చేరు. పిల్లలు కిక్కురుమనకుండా కూర్చున్నారు; రామిగాడు వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. పిల్లలందరికీ జాలేసింది; రామిగాడు ఏడవడం వాళ్ళిదే మొదటి సారి చూడ్డం; మాష్టరు మెల్లిగా చెప్పడం మొదలుపెట్టేరు; "నీగ్రో అంటే మీకు తెలుసునా? ఆఫ్రికా అనే దేశంలో మనలాగే ఉండే మనుషులు; వాళ్ళకి ఎండ ఎక్కువ. అంచేత నల్లగావుంటారు; వాళ్ళు పాపం, చాలా బీదవాళ్ళు; వాళ్ళకి బట్టలు లేవు; తిండానికి అన్నంలేదు; అంచేత వాళ్ళది చీకటి దేశం అన్నారు.'

తెల్లగావుండే ఇంగ్లీషువాళ్ళు వాళ్ళని చాలా బాధలు పెడుతున్నారు. వాళ్ళ పిల్లలు రామిగాడిలాగే మంచి చురు

కైనవాళ్ళూ, బలమైనవాళ్ళూను; మన రామిగాడు ఎంత బలమైనవాడు" అన్నారు. పిల్లలందరికీ రామిగాడిబలం తెలుసు; వాడు ఒకనాడు పందెంవేసి చేత్తో మాష్టరుగారి టేబిలు విరగ్గొట్టేశాడు. మళ్లీ మాష్టరుగారు చెప్పడం మొదలుపెట్టేరు.

"కాని పాపం వాళ్ళు చాలా బీదవాళ్ళు; వాళ్లని బాధపెడుతూన్న ఇంగ్లీషువాళ్ళని మీరు వెక్కిరిస్తారా లేకపోతే, పాపం నీగ్రోపిల్లలిని వెక్కిరిస్తారా? మీ చిన్నతమ్ముడిని ఎవరేనా కొడితే మీ రేంచేస్తారు?" అన్నారు మేష్టరుగారు.

"మా అమ్మతోటి నాన్నతోటి చెప్తాం" అన్నారు పిల్లలు.

"అంచేత రామిగాడిని నీగ్రో అని పిలవకూడదు; తప్పు; రామిగాడు చాలా మంచివాడు; వాడికి పదహారెక్కాలు కంఠతావొచ్చు; మీ కొచ్చునా?" అన్నారు. పిల్లలు రామిగాడినిచూసి సిగ్గుపడ్డారు. రామిగాడూ, మేష్టరుగారూ మంచివాళ్లు; మేష్టరుగారు నీగ్రోలగురించి ఇంకా కొన్ని కథలు చెప్పేరు; ఆయనక్లాసులో ఎవరూ అల్లరి చెయ్యరు; ఎప్పుడైనా, ఎవరైనా మేష్టరుగారి పొడుంషబ్బి దాచిస్తే "నా పొడుంషబ్బి ఇచ్చినవాళ్లకి మంచికథ చెప్తాను" అనేవారు. పిల్లలు ఆయన పొడుండబ్బీ ఇచ్చేసి కథ చెప్పమనేవారు. ఆయన ఎన్నో కథలు చెప్పేవారు.

కాని నెలరోజులదగ్గరినుంచీ ఆ మాష్టరుగారు బడికి రావడం మానేశారు. ఎంచేతో ఎవరికీ తెలీదు; కొత్తమాష్టరుగారు వచ్చారు. కాని ఆయనకి కథలు రావు; పిల్లలని చింతబరిక్కతో కొడతారు; గోడకుర్చీ వేయిస్తారు; గుంజీలు తీయిస్తారు; కొత్తమాష్టరుగారు మంచివారుకారు.

కొత్తమాష్టరుగారు ఎక్కాలు రాలేదని రాధని కొంప డ్డారు. రాధ ఏడుస్తూ ఇంటికొచ్చేసింది. వాళ్ళమ్మ కొత్త మాష్టరుగారిని తిట్టింది.

రాత్రి రాధ భోంచెయ్యలేదు. పాతమాష్టరుగా రున్నప్పుడు ఎక్కాలు కంఠతావచ్చాయి. కొత్తమాష్టరుగారు రాగానే మరచిపోయింది. రాధ మంచంమీద కూర్చుని గోడమీద బల్లిని చూస్తూంది మతిపోయినట్లు; రాధ నాన్నగారువచ్చి అడిగారు. "అన్నం ఎందుకుతినలేదు తల్లీ, పోనీ పాలుతాగు"

"అలాగే నాన్నగారు, పాలు తాగుతాను; కాని మా పాతమాష్టరుగారు ఎందుకు బడిమానేశారు నాన్నా" అని అడిగింది రాధ.

"వాడా, వాడు క్లాసులో రాజకీయాలు చెప్పేవుట పిల్లలకి"

"రాజకీయాలంటే ఏమిటి నాన్నా"

"అంటే నెహ్రూగారిని తిట్టేవటట"

"నెహ్రూ అంటే ఎవరు నాన్నా, నీగ్రో?" అంది రాధ.

"ఛీ కాదమ్మా"

"మరెవరు, ఇంగ్లీషువాడా"

"కాదమ్మా, మనందరికీ పెద్ద అన్నమాట. అదిగో ఆ పటంలో ఉన్నారే ఆయన" అంటూ గోడమీదవున్న పటం చూపించారు. మెళ్లో పూలదండ వేసుకొని నవ్వుతున్నారు గోడమీద నెహ్రూగారు.

"ఆయనా, ఆయన్ని తెలుసు నాన్నా; అల్లప్పుడు పెద్ద మీటింగుకొస్తే అమ్మ చూపించింది. మా పాతమాష్టరు ఆయన్నుగురించి కథ చెప్పలేదు నాన్నా అయ్యో, నీగ్రోల గురించి చెప్పేరు" అంది రాధ పెద్ద అన్యాయం జరిగినట్లు కళ్ళుపెట్టి.

"నీకు తెలీదులే. పాలు తాగి పడుకో" అని వాళ్ళ నాన్నగారు వెళ్ళిపోయారు. రాధకి నిద్రపట్టలేదు; పాతమాష్టరుగారు చెప్పిన కథలు జ్ఞాపకానికి వస్తున్నాయి. కిటికీలోంచి చూస్తే అవతల చాలా చీకటిగావుంది; ఆఫ్రికా చీకటిదేశం ఇలాగే ఉంటుందికాబోలు ననుకుంది; దూరంగావున్న గుడిశలో రామిగాడు దీపప్పుబుడ్డిముందు ఎక్కాలు చదువుతున్నాడు.

—o—

# ప్రభు వెక్కిన పల్లకీ

ఉదయం తొమ్మిది గంటలైంది కాని పల్లకీ యింకా రాలేదు.

"చూశారా పంతులుగారూ, యీ పల్లకీవాళ్లెంత దగా చేశారో! పొద్దుట ఎనిమిదో గంటకల్లా వస్తామని చెప్పిన వాళ్ళీసరికి రాలేదు. ఒట్టి దొంగ వెధవలు సుమండీ" అన్నారు గణపతిరాజుగారు.

"చిత్తం, చిత్తం. తమతో నే నింతకుముందే మనవి చేసేను. ఈ వెధవల్ని నమ్ముకుంటే మనల్ని గంగలో దింపుతారు"

"అందుకే నేను మొదట కారు తెప్పిద్దామన్నాను. మీరు పల్లకీ, పల్లకీ అన్నారు. చివరికీ వెధవలు ఇలా దగాచేశారు"

"తమకి కోపంవస్తే నే చెప్పలేనుకానీ, ఎంతేనా పల్లకీ పల్లకీయే, కారు కారే. నే పౌరోహిత్యంచేసిన పాతికేళ్ల లోనూ కొన్ని వందలపెళ్ళిళ్లు చేయించేను. ఇంక మనింట్లో ఓ డజను పెళ్ళిళ్లు చేయించేను. నాకు తెలీదంటారా? పల్లకీదర్జా వెధవ కారుకి ఎలావస్తుంది చెప్పండి? అయితే ఈ వెధవలు దగా చెయ్యాలంటే కారువాడు చెయ్యలేడా? అసలు కారే దగా చెయ్యవచ్చును. తీరా తీసుకొచ్చేక నడవకపోతే దాన్నిక మనమందరము తొయ్యాలి. వాళ్ళో వస్తూవుంటారు యీ పాటికి. పాపం దార్లో ఏ మాటంకమొచ్చిందో ఏమిటో!"

"ఏం రావడమో, వెధవలు; పోనీ ముందరే ఏడవ రాదూ, ఇన్ని గంటలకుగాని రాలేమని. రానీండి వెధవల్ని చెప్పుదెబ్బలు కొట్టిస్తాను" అని గణపతిరాజుగారు కస్సిరచేశారు.

"ఎందుకేనా మంచిది. ఓ అరగంట చూసి అప్పటికీ రాకపోతే మరొక రెండెడ్లబండి తెప్పించండి. వర్జంరాకముందే బయలుదేరాలి" అన్నారు సిద్ధాంతిగారు ముక్కుపొడుం ఎగ పీలుస్తూ.

"వర్జం ఎన్నిగంటలనుండి ఎన్నిగంటలవరకూ వుంటుందన్నారూ?"

"ఉదయం 10-2 నిముషాలకు ప్రవేశించి మధ్యాహ్నం 2-40 నిముషాలవరకూ ఉంటుంది. కాబట్టి పదిలోగానే బయలుదేరాలి" అంటూ శాస్త్రుల్లుగారు ముక్కుపొడుం పట్టుతీసి, లోగిట్లోకెళ్ళి అందర్నీ హెచ్చరించేరు. పెళ్ళిలో పురోహితుడికి చొరవయిస్తే [ఇవ్వకపోయినా సాధారణంగా తీసుకుంటాడు] అందరినీ చంపుకుతింటాడు; ఏదో పురమాయిస్తూనే వుంటాడు.

అసలు సంగతేమిటంటే గణపతిరాజుగారు ముచ్చటగా మూడోపెళ్లి చేసుకుంటున్నారు. ఈ పనికి బంధుమిత్రులంతా సంతోషించేరు పెళ్ళికూతురుతప్ప. రెండువందల ఎకరాల పల్లం, మూరెకరాల పెట్టుతోటా దొడ్డి వున్నాయి. ఆయనంటే మహరాజు, ఎన్ని పెళ్లిళ్లైనా చేసుకోగలరు.

రాజుగారి పెళ్లినాటి ఉదయం లోగిలి కలకలలాడుతూంది. పేషిలో పెద్ద పందిళ్లువేశారు; తోరణాలు కట్టేరు; అరటిచెట్లూ కొబ్బరాకులూ తెచ్చి కట్టేరు. ఆ వొచ్చిన మం

గలి పీరిగాడి తకోరామేళం, పట్నంనుంచి బేండుమేళం వచ్చాయి. బంధువర్గాలు, మిత్రులు, పురోహితులు, వైదిక బ్రాహ్మణులతో పందిరి శోభాయమానంగా వుంది. లోగిట్లోంచి కిలకిలమని స్త్రీల నవ్వులు వినవస్తున్నాయి. భజంత్రీలు మోగుతున్నాయి. పందిట్లో ఒకమూల రాజుగారి మేనమామ గారు తన పాండిత్యం ప్రదర్శిస్తున్నారు. మేనమామగారు కవి. సంస్కృతకావ్యాలు క్షుణ్ణంగా చదువుకున్నారు. తెల్లగా వొడ్డు, పొడుగూ గంభీరమైన ఆకారం. గిరజాలజుత్తు, చక్కటి మీసాలు, సిల్కువోణి ఆస్థానకవిలా కనిపిస్తారు. అందుచేత ఆయన్ని కవిరాజుగారంటారు. ఆయన పందిట్లో నలుగురు శ్రోతల్ని చేరదీసి తన కవిత్వం వినిపిస్తున్నారు. మొగపెళ్లి వారంతా అక్కడికి మూడుమైళ్ల దూరంలో వున్న గ్రామానికి ప్రయాణం అవుతున్నారు. సాయంత్రం 6-40 గంటలకు ముహూర్తం నిశ్చయించారు. పెద్దలు వర్జం రాకముందే బయలుదేరి ఆడపెళ్ళివారింటికి తరలి వెళ్లడం మంచిదని పురోహితులు నిర్దేశించేరు.

రాజుగారికి తలంటి నీళ్ళుపోసి, పసుపురాసి పెళ్లికొడుకుని చేశారు. పెళ్లికుమారుడు మొహం కలకలలాడుతూ వుంది. కిట్టనివాళ్ళు ఏవో మాటలంటారు గానీ, ఆయన మొహంలో మూడవ పెళ్లివాడి లక్షణాలు లేవు. వయసు నలభై అయిదేళ్ళు పైబడినప్పటికీ వయసుముదిరిన లక్షణాలు ఎక్కడా కనబడవు.

అంతేకాదు కవీశ్వరుడైన మేనమామగారు గణపతి రాజుగారిని నలచక్రవర్తితో పోల్చేరు. 'ధూర్జటిజటా కిరీ

టాలంకారంబైన శశాంకుని సౌకుమార్యంబునూ, అమృత మున కుత్పత్తిస్థానమైన పయోనిధానంబు గాంభీర్యంబును, విశ్వవిశ్వంభరాం భోజ కర్ణికాయమానంబగు సువర్ణాహార్యంబు ధైర్యంబును' ఈవిధంగా నలమహారాజులో గల లక్షణాలన్నీ గణపతిరాజుగారిలో వున్నాయని కవిరాజుగారు శ్రోతలతో అన్నారు. వారిచే బలవంతంగా వొప్పించేరు.

అసలువిషయానికి వద్దాం. ఇక్కడికి పదిమైళ్ళ దూరం లోగల పట్నం వెళ్ళి పెళ్లికి పల్లకి బేరమాడివచ్చారు. పట్నంలో నాగాశపు రంగయ్యదగ్గర చాల పల్లకీలున్నాయి. అతను పల్లకీ అద్దె పుచ్చుకుని బోయీలను కుదిర్చేడు. ఎనిమిదో గంటకల్లా పల్లకీ పంపిస్తానని వాగ్దానంచేశాడు. కాని పల్లకీ యింకా రాలేదు.

అందుచేత రాజుగారు కోపంతో చిందులుతొక్కు తున్నారు. కోపంతో చేతిలో గాజుగ్లాసు విసిరేశారు. నీళ్ల కూజా బద్దలుకొట్టేరు. బూతులుతిడుతూ బోయీలమీద కోపం బంట్రోతులమీద చూపించారు.

పావుతక్కువ పదిగంటలైంది. పూసిన రెండెడ్లబళ్లు వీధిలో కొచ్చి నిలబడ్డాయి. అందరూ సామాన్లుకడుతూ ప్రయాణానికి సిద్ధమవుతున్నారు.

రాజుగారు జరీ కండువావేసుకొని, అద్దంముందు కొచ్చి మీసం మెలివేశారు. తలమీద ఒకటి రెండు నెరసిన వెంట్రుకలుంటే తీసిపారేశారు తన స్వరూపం పెళ్లికూతుర్ని ఆకర్షి స్తుందని తృప్తిపడ్డారు.

ఇంతట్లో పల్లకీ వచ్చిందంటే పల్లకీ వచ్చిందన్నారు.

ఇంటి దురుగా వున్న పెద్ద మ్రిచెట్టునీడలో పల్లకి దించేరు బోయీలు. గుడ్డపాతలతో చమట తుడుచుకుని చెట్టుకిందకూర్చోబడ్డారు.

పురోహితుడు వీధిలోకి హడావిడిగా వచ్చి, "ఏమ్రా వెధవల్లారా, కూచోబడ్డా రేమిటి, వేళయింది, లెండిలెండి" అని హెచ్చరించాడు.

బోయీలందరూ మంచి బలిష్టులే కాని పదిమైళ్లు నడిచేసరికి పూర్తిగా అలసిపోయారు. అందులోకీ వేసవికాలం. ప్రొద్దుటే ఎండ చుర్రున తగులుతూంది. ఆరుగురు పల్లకీ మోస్తారు; మధ్యమధ్య అలసినవాళ్ళకి సాయం చెయ్యడానికి యిద్దరు అదనంగా వున్నారు. వాళ్లలో యిద్దరు యువకులు, ముగ్గురు మధ్యవయస్కులు, ఒకడు కొంచెం కాలం మల్లినవాడు. యువకులైన చిన్నిగాడూ సీతిగాడూ చాల చురుకైనవారు. చిన్నిగాడు మంచి బలిష్టుడు. నల్లటిశరీరం కండలుదేరి నిగనిగలాడుతూంది. బరువైన పల్లకీకొమ్ము భుజాని కెత్తుకోగానే వాడి వీపుమీద కండలు వెదురుకర్రల్లా పెళపెళ విరిగినట్లు కనిపిస్తాయి.

"ఏరా లేవరేమిటి!" అన్నాడు మళ్ళీ పురోహితుడు. అవునుమరి! ఆయనతొందర ఆయనది. వర్జంరాకుండా బయలుదేరాలాయెను.

"ఇదిగో కసింత సల్దిగంజి తాగి ఒక సిటికలో బయలెద్దాం బాబూ పంతులుగారూ" అన్నాడు చిన్నిగాడు.

"బాగుంద్రా ఇప్పుడు మీ భోజనానికి వేళెక్కడ మండి! ఇంత ఆలస్యంగా రావడమే కాకుండా యిక్కడ చల్ది

గంజీ వ్యవహారంకూడానా? ఏం యింటిదగ్గర తాగి రాలేక పోయారూ?'' అన్నాడు పురోహితుడు.

"అదేమిటి బుగతగారూ అలాగంటారు. ఆ రంగయ్యబాబింటికి పెందలకడ ఎత్తే గంట కూకోబెట్టి పల్లకీ ఇచ్చినాడు. సల్దికూడూ, బత్తేలు రాజుగారింట్లోనే నన్నాడు. ఈకాడికి పచ్చిమంచినీళ్లు నోట్లో ఏసుకోలేదు బాబు, సెబితే నమ్మరుగాని'' అన్నాడు చిన్నిగాడు.

"అబ్బే. అవన్నీ యిప్పుడు లాభంలేదు. పదండి ఉంటే మరొక రెండునిముషాల్లో వర్షం వస్తుంది మళ్ళీ''

"ఇదేమిటి బాబు' అయిదుకోసులు నడిసొచ్చి సల్దిగంజి నేకపోతే మరో రెండుకోసు లెల్లడం మా తరమా బాబు. మనసులమా ఎనుబోతులమా సెప్పండి''అన్నాడు చిన్నిగాడు.

"ఛీ వెధవా నోరుముయ్'' పురోహితుడికి కోపం వచ్చింది. "అదేమిటి బాబు ఎదవా ఎదవా అని తిడతారు. రాజుగారు పెల్లి సేసుకుంటే ఊరోళ్ల పెళ్లాలు సచ్చిపోతారేటి? మంచోరే''

ఈ సంభాషణంతా లోపలినుండి వింటూన్న గణపతి రాజుగారు కోపంతో చిందులుతొక్కుతూ బూతులుతిడుతూ బయటికి వచ్చారు.

"లంజకొడుకుల్లారా, ..ఇంత ఆలస్యంగావచ్చి మల్లి మాటాడ్డం కూడానా? మీా బుర్రతిరుగుడు వొదలగొడతా నుండండీ!'' అన్నారు రాజుగారు.

చిన్నిగాడు ఏదో అనబోయాడు. బోయిలలో ముసలివాడైన వెంకడు ముందుకొచ్చి వాడిని కొంచెం వెనక్కి నెట్టేడు.

"ఓ రంగ్రడా సిన్నిగా, పెద్దా సిన్నా లేకుండా ఏటా వోగుడు. బాబు ఏలినోరికి కోపమొస్తే మేం చెప్పలేం కానీ, యిందులో మా తప్పేటి లేదు బాబు" అన్నాడు ముసలివెంకడు.

"ఛీ, వెధవా యింకా తప్పులేదంటావా ?" అన్నారు రాజుగారు.

"ఆలకించండి బాబు దద్దయ్యగోరూ, మామ నాగారపు రంగయ్యబాబింటికి పెందలకడే ఎల్లినాం బాబు. ఆడి పల్లకీలన్నీ పెల్లిల్ల కెల్లిపోనాయి బాబు. సిరిపురంనుండి పల్లకీ వొచ్చిందాక మమ్మల్ని కూకోబెట్టి, అప్పుడిచ్చినాడు. సల్దిగంజేనా తాక్కుండా పల్లకీ పట్టుకొచ్చినాం బాబు" అన్నాడు వెంకడు.

"వెధవల్లారా. ఆలస్యమైందికాక, బయల్దేరమంటే ఆయనతో వాదనా, మీదుమిక్కిలి! నా తడాఖా తెలీదుకాబోలు చర్మం వొలిపిస్తాను తెలుసా" అని రాజుగారు బూతులికి లంఘించుకున్నారు.

చిన్నిగాడికి వొల్లుమండింది. ముసిలి వెంకణ్ని వెనక్కితోసి, "వోదనేటి బాబూ, సల్దిగంజి తాగినాక పల్లకీ ఎత్తుతామన్నాంగాని" అన్నాడు.

"ఛీ లంజకొడకా, నోరుముయ్యి" అన్నారు రాజుగారు.

"అదేటి తిడతారేటి భాబూ. మంచోరే" అన్నాడు చిన్నిగాడు చిరాగ్గా. రాజుగారికి కోపంతో ఆవేశమొచ్చింది. ఇరవై ఏల్లుగా తను ఊళ్లో చాకళ్లనీ, మంగళ్ళనీ, పాలేర్లనీ నిరాఘాటంగా తిడుతున్నాడు. ఇప్పుడంటే ఊళ్ళో చాకలి వెధవలు, మంగలి వెధవలు సమంగా మాట వినకుండాపో

యూరుగాని, తన తండ్రిగారు బతికివున్నప్పుడు తాను మంచి యవ్వనంలో ఉన్నప్పుడు (ఇప్పుడు లేరనికాదు) తన పేరుచెబితే ఊళ్ళో పశువులు నీళ్లు తాగేవికావు. తన్నలా తయారుచేశారు తండ్రిగారు. తను ఊళ్ళో యిష్టమొచ్చినవాళ్లని తిట్టేవాడు, కొట్టేవాడు, యిష్టమొచ్చిన ఆడదాని జబ్బపట్టుకుని లాగేవాడు. అలాంటిది యీనాడీ పల్లకీమోసుకునే చాకలి వెధవలు తిట్టడానికికూడా తనకి హక్కు లేదనేవాళ్లేనా? తన పౌరసత్వపుహక్కు నెవరో ఛాలెంజీ చేసినట్లనిపించింది రాజుగారికి. ఆయన కోపంతో ఒళ్లుమరచిపోయాడు.

"లంజాకొడకా తిడతాను, కొడతానుకూడాను. నా సంగతి నీకు తెలిదురా. ఎముకలు విరగ్గొడతాను వెధవా" అని చిన్నిగాడిచేతిలో కర్రలాక్కుని ఒక్కటివేశారు. అయితే యీ దెబ్బలన్నిటికి అడ్డుపడిన ముసలివెంకడినుదుటికి తగిలిందా దెబ్బ. వాడి నుదురుమీద నెత్తురుచిమ్మింది. వాడు సొమ్మసిల్లి నేలపడిపోయాడు. చిన్నిగాడుకూడా కలియబడ్డాడుగాని తక్కిన బోయీలూ, వాళ్లూ విడతీశేరు. రాజుగారు బోయీలు దెబ్బలాడుకోవడంచూసి చాల జనమూగేరు. చిన్నిగాడు చెప్పరాని బూతులుతిట్టేడు. బంధువులూ, స్నేహితులూ వచ్చి రాజుగారిని వీధిసావిట్లోకి తీసుకువెళ్ళేరు.

ముసిలివెంకడి నుదుటికి గుడ్డకట్టి నీళ్లుజల్లేరు. వాడికి తెలివివచ్చింది కాని చాల బాధపడుతున్నాడు; చిన్నిగాడికి వెర్రికోపమొచ్చింది.

"నెగండ్రా, ఎత్తండి పల్లకీ, పదండి పోదాం. ఈ నా కొడుకుని పల్లకీమోసేకంటే సచ్చిన ఎనుబోతుని మొయ్యడం

నయం న న్నొగ్గవలసిందిరా, నాకొడుకుని పందిని బాదినట్టుబాది సంపేద్దును, రాచోడైతే అయినాడుగాని"

బోయీలు భయపడిపోయారు. చిన్నిగాడి సాహసాన్ని కొంతమంది విమర్శించేరు. ఇంతకాలమై పల్లకీ మోస్తున్నారు కాని యిటువంటి అనుభవం వారి కెప్పుడూ కలగలేదు. అయిదారు గ్రామాలను గడగడలాడించిన రాజుగారిమీద తిరగబడడమే! మహా మహా తాసీల్దారులూ, సముద్దారులే ఆయన మాటకి ఎదురుచెప్పలేరు. రాజుగారి అనుగ్రహం లేకపోతే పొరుగూరువాడికి యీ వూళ్లో పచ్చిమంచినీళ్లయినా పుట్టేవి కావు. అలాంటిది బట్టలుతికే చాకలిచిన్నిగాడు ఆయనమీద తిరగబడటమే! ఏం విచిత్రం!

"ఒరే సిన్నిగా తొందరపడిపోనావురా; ఏదో కాళ్లూ సేతులూ పొట్టుకొని బతిమాలుకుంటే తీరిపోయేదికదా! ఛ! ఏటా ఆ కుర్రతనం!" అన్నాడు రాజుగారిచేత దెబ్బలుతిన్న ముసలివెంకడు.

"ఏట్రోయ్ ఎంకన్నా, ఏటి ఎంత సాకలోళ్ళమైనా ఉప్పూ కారం తింటున్నాంకదా! ఏ నేరంనేందీ తిడితే వాళ్లని కూరుకోమంటావేంటి? మంచోడివే, బయమ్మేట్రా? ఏటి పీక తీసేస్తాడేటి?"

"ఏటో ఏదైన నీది ఖ్యాత్రిగ కుర్రతనంరా సిన్నిగా ఎప్పుడు రుసరుసనాడితే పనిజర్గు తాదా సెప్పు?"

"అయితే ఏటా నువ్వోసేడు ఇన్నేళ్లొచ్చినాయి చిగ్గు నేదురా, ఛీ! ముసముజలము ఎత్తగానే సరా?"

"అయితే యిప్పు డేటిసెయ్యాలో సెప్పరా?"అన్నాడు

వెంకడు. ఏదైనా చిన్నిగాడి సలహాలేంది ఏ పనీ జరగదు చాకలాళ్లకి.

"సర్దికూడెట్టి, ముందుగా బత్తేలూ, కూలిడబ్బులూ యిస్తే కొమ్ము ఎత్తుకుంటాం బాబూ అని సెప్పేదాం. అంతా ఒకమాటమీద నిలబడాల, తెలిసిందా? ఎవడేనా ఎనకదీసినాడా నాకొడుకుని బండికేసి ఉతికేస్తాను అంతే. నాతోటి ఈ ఏసాలు సాగవురోయ్ నాయినా!" అన్నాడు సిన్నిగాడు.

సావిట్లోంచి రాజుగారు ఇదంతా విన్నారు. విని గబ గబ వీధిలోకివచ్చి 'పల్లకీ మొయ్యడానికివచ్చి షరతులుపెడ తావురా! లంజాకొడకా! ఒక్క దమ్మిడీ యివ్వను; పల్లకీ తీసు కుని ఊరుదాటి ఎలా వెళ్తావో చూస్తాను' అన్నారు. అలా అని ఊరుకోలేదు. ఊళ్ళో చాకలాళ్ళని పిలిపించి పల్లకీ ఎత్తమన్నారు.

'ఒరే సెప్తూతున్నాను ఇనుకొండిరా, ఏ సాకలి నంజ కొడుకేనా కొమ్మట్టుకున్నాడా సీరేస్తాను, ఎరికా? సాకలిసిన్ని తడాఖా మీకే ఎరిక! అంతేకాదురా నాయనా రేపు రోడ్డెక్కి నడవనేరురా బాబూ, జాగరత' పట్నంచిన్నిగాడి కీర్తి ఊళ్లో చాకలాళ్ళకి తెలుసు. పట్నంలో చాకలాళ్ల సంఘానికి వీడు పెద్ద. వాల్లు మీటింగులుచేస్తారు. మీటింగు వున్ననాడు చిన్నిగాడు లాల్చీ తొడిగి, పంచకట్టి, పెద్దపాగా చుట్టి, మీసం మెలివేసి, [illegible] పాటిఖా ర్రపట్టుకుని నాయుడిలా తయారవుతాడు. చాల హడావుడిచేస్తాడు. చాకలాళ్ళంతా ఒక కట్టుమీద వుంటారు. అంచేత వాల్లు నాలుగుడబ్బులు చేసుకుంటున్నారు. కాని ఈవూరు చాకలాల్లకి సంఘంపెట్టే

ధైర్యంలేదు. కాని రాజుగారిని ఏమంత లక్ష్యపెట్టడం మానీశారు. అంచేత అప్పుడు పల్లకీమోసే అలవాట్లు మాకు లేదన్నారు. అలవాటు లేనివాళ్లు పల్లకీమోస్తే దారిలో ఎత్తేసినా ఎత్తేస్తారు. అంచేత రాజుగారు వాళ్లని నాలుగు బూతులు తిట్టి పొమ్మన్నారు.

"ఓరే ముసిలోడా, వొల్లక పల్లకీలో తొంగోరా మొగం తిరిగిపోగలదు" అంటూ చిన్నిగాడు వెంకణ్ణి పల్లకీలో పడుకోబెట్టేడు.

"దొంగలంజాకొడుకులు! ఎంతపొగరు!" అంటూ రాజుగారు చాకల్లని ఊరు బయటకురాగానే చావచితకతన్నమని ముందుగా పాలేర్లని పంపించేరు. రాజుగారిది గొప్ప దూర దృష్టి కాని పాలేర్లు జడిసిపోయారు. ఆపనిచేస్తే రేపు పట్న మెల్లినప్పుడు చాకలాల్లు వూరుకుంటారా? కొట్టి చంపేస్తారు.

"ఒరే వీర్రాజూ, పోలీసువాళ్లని పిలిపించి యీ వెధవలనందరినీ కొట్లో తోయించరా. ఆ నీలుగుకాస్తా కట్టిపోతుంది" అని రాజుగారు మేనల్లుడు వీర్రాజుకి ఆదేశించేరు.

"ఏమ్రా, రాజుగారి కాల్లమీదపడి బతిమాలుకోండ్రా, కోపంగా వున్నారు" అన్నాడు వీర్రాజు.

"సైగండ్రా. ఎత్తుకోండిరా కొమ్ము. పల్లకీలో వొల్లక తొంగోరా ఎంకా" అని [illegible]డు పల్లకీకొమ్ము ఎత్తేడు.

ముసలి వెంకణ్ణి పల్లకీలో వేసుకొని పల్లకీ తీసుకొని వెళిపోయారు బోయీలు. రాజుగారి పెళ్లి ముహూర్తం తప్పిపోయింది.

—o—



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 106 B 122 |
| పుస్తకం పేరు | కథావాటింపి 2 |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 107 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |